శ్రీరస్తు.

శ్రీ వేంకటేశాయ నమః.

శ్రీ, వేములపల్లె - వేంకటసుబ్బ సత్కవిప్రణీతంబగు

# ఉషాపరిణయ నాటకము.

ఈ గ్రంథము.

ప్రపంచ - సర్వేశ్వరశాస్త్రులచే

బరిష్కరింపఁబడి

బరరాదు*త్యాగరాయశాస్త్రులవారిచే

స్వకీయ

గీర్వాణ భాషారత్నాకర ముద్రాక్షరశాలయందు

ముద్రింపంబడియె.

౧౯౧౨ - సం

చన్నపురి,

శ్రీ

# నూతన గ్రంథముల ప్రకటన.

**బెడుదూరు - కళాపూర్ణోదయనాటకము**= ఇది, బెడుదూరు- రామాచార్య కవిశ్రేష్ఠులచే అత్యద్భుతముగనుండునట్లు రచియింపబడిన నాటకము రూ. ౦ - ౮ - ౦.

**విజయవిలాసము** - పద్యకావ్యము ప్రతిపదటీకాతాత్పర్యసహితము ఇది ప్రతిపద్యరసాస్పదంబై రసికాగ్రగణ్యులచే మనుచరిత్ర వసుచరిత్రలకంటె మిక్కిలి రసవంతమైనదని జగత్ప్రసిద్ధినొందిన గ్రంథము రూ ౨ - ౦ - ౦.

**రెట్టమతశాస్త్రము - పద్యకావ్యము** తెనుగు తాత్పర్యసహితము. ఎప్పుడువర్షముకురియునో ఆసంగతిని వివరముగ దెలియజేయు శాస్త్రము రూ ౦ - ౧౦ - ౦.

**అంగవిద్యా - అనుప్రశ్నశాస్త్రము** ప్రతిపదటీకాతాత్పర్యసహితము ప్రశ్నచేయువాడువచ్చి ప్రశ్నఅడుగగానే వానియొక్క ముఖవైఖరి మొదలగువానినిజూచి ఫలముచెప్పునట్టిది ఇదిప్రత్యక్షానుభవ ప్రశ్నశాస్త్రము రూ ౦ - ౬ - ౦

| | | | |
|---|---|---|---|
| వేములపల్లె విరాటనాటకము | ౦-౮-౦ | భల్లాణరాజునాటకము | ౦-౮-౦ |
| వేములపల్లె ద్రౌపదీకల్యాణనాటకము | ౦-౬-౦ | ద్రౌపదీవస్త్రాపహరణనాటక | ౦-౨-౦ |
| | | బెడుదూరు- హరిశ్చంద్రనాటక | ౦-౬-౦ |
| వేములపల్లె ఉషాపరిణయ నాటకము | ౦-౨-౦ | సైంధవనాటకము | ౦-౮-౦ |
| | | కపిలదేవహూతిసంవాదనాటకము | ౦-౬-౦ |
| ప్రద్యుమ్ననాటకము | ౦-౬-౦ | ధ్రువనాటకము | ౦-౬-౦ |
| సావిత్రీనాటకము | ౦-౮-౦ | | |
| గయోపాఖ్యాననాటకము | ౦-౮-౦ | అంబరీషనాటకము | ౦-౮-౦ |
| నలమహారాజునాటకము | ౦-౮-౦ | బలపనూరు-ప్రహ్లాదనాటకము | ౦-౩-౦ |

తపాలాఖర్చులు ప్రత్యేకముగ నివ్వవలయును.

గ్రంథములు వలయువారు మదరాసులో బరూరు - త్యాగరాయశాస్త్రులపేర వ్రాసి తెప్పించుకొనేది.

శ్రీ ర స్తు.

# వేములపల్లె - ఉషాపరిణయము - నాటకము.

## యక్షగాన ప్రబంధము.

శ్రీ రాధామణి యుగ్ స్వకీయ కుచరాజత్కస్తూరిక్ సిస్తుగా । గిరునామముదీర్చి తీర్చి తియనక్ గీల్కొన్న మోదంబునక్ । యారాజాస్యకపోలదర్పణములక్ యాస్యంబు సింగారముక్ । సారెక్ గన్గొని వేటకా ముద్దుగొను యాశౌరిక్ మదక్ గొల్చెనక్॥ దరువు - ఆదితాళము - శంకరాభరణము.

శ్రీరాధామణిలోలా-మేరు- ధీరాకాంచనమయచేలా - నారదనుతదధిచోరాశోభితమణి - హారాయశోదాకుమారాతామురాంతక॥ శ్రీరా॥ ఇందిరారమణాముకుందా-నంద నందనహరిగోవిందా- మందారోద్ధరసురబృందవినుతయర-విందనాభమిత్రా గోవిందామాన్నోహరా॥ శ్రీ॥ కస్తూరితిలకలలాటా-చక్రి-హస్తాబ్జరాగకిరీటా-కౌస్తుభమణిరుచిసిస్తులోరస్థల - ప్రస్తుతమునిజనహస్తీంద్రవందిత॥ శ్రీ॥ కుండలాంచితకర్ణయుగళా - దైత్యాఖండనవరకంబుసగళ-భండ[illegible]ఖండలనుతనామ- అండజాగమనమార్తాండకోటితేజా॥ శ్రీ॥ వేమూలపల్లివిహారా-గోప - కామినిజవచిత్తచోరా- కామజనకపూర్ణసోమవదనబల-రామసోదరసత్యభామామనోహరా॥ శ్రీరా॥

చ॥ హరియమృదంగమూనచతురాస్యుడు తాళము వ్రేయ వేణువుక్ । సురపతియూదవాణిశశిసోదరివీణెలుమీటిపాడగా । వరగబ్రదోషకాలమున పార్వతికొల్వునతాండవించుశం । కరునిపదాబ్జముల్ హృదయకంజములోపల నాశ్రయించెదక్॥ దరువు - జంపె - నాటరాగము.

జయజయత్రిలోకేశ-జయశైలజాధీశ - జయజయచిదాకాశ - జయవ్యోమకేశా- అసమవృషభతురంగ- అతులసదయాపాంగ - అసురదుర్మదభంగ-హస్తసారంగా- మారగర్వవిదూర- మునీంద్రమందారా- భూరిసుగుణోదారభుజగేంద్రహారా- శరదభ్రసమగాత్ర- చంద్రార్కశిఖనేత్ర- ధరణివేములపల్లెధామసన్మిత్రా॥జయజయత్రిలోకేశ- జయశైలజాధీశ॥

చ॥ హరిహరపద్మసంభవషడాననా శ్రీగిరిజాసరస్వతీ । సరసిజమిత్రచంద్రకుజసౌమ్యబృహస్పతిదానవార్యభా । సురనుతరాహుకేతుబలశాసనపావకదండికోణరా । డ్వరుణమరుత్కుబేరవృషవాహముఖామరులక్ భజించెదక్॥ వ॥ ఇట్లు ఇష్టదేవతాప్రార్థనంబు చేసి॥

సీ॥ వ్యాసవాల్మీకబిల్హణకాళిదాసాదిఘనులైనగీర్వాణకవులదలచి। పోసగనన్నయభట్టుపోతనామాత్యాది యాంధ్రకవీంద్రుల నభినుతించి । పాపమెంచకదురాక్షేపణలొనరించుమందుగా కుకవులనిందజేసి । యతివేడ్క-యేనొకకృతిసేయబూనితిం మహీనిమద్వంశ్యక్రమంబు వినుడి । బ్రహ్మకులమునబ్రత్యక్షబ్రహ్మయనుచు। పాత్రులెన్నగ శ్రీవత్సగోత్రమునను నవతరించెనుయమ్మనూరాన్వయాబ్ధి। యజ్ఞుడైపూనిసర్వేశ్వరావధాని॥ క॥ ఆ తేజోధన్యునకున్ భూతేశ్వరపాదపద్మపూజారతుడై ఖ్యాతిగ జనించె సుగుణ। వ్రాతుడు పరమేశ్వరార్యవర్యుండెలమిన్॥ గీ॥ ఆయనకుగల్గెనీలకంఠాఖ్యుడతడు। శ్రీమనాలూరు వేంకటరామపుత్రి। పుల్లమాంబాఖ్యవలననన్నొసగగాంచె। ఘనులు వెంకటసుబ్బసత్కవియనంగ॥ యిట్టిమదీయవృత్తకములకర్ణికాంతరంబునందు॥

దరువు - ఆదితాళము - మధ్యమావతిరాగము.

గణనాథుడాడుచున్నాడో- మణిగణకోటీరఘృణులరాక ధీధీతు - లణపతాండవంబాడుచున్నాడు॥గ॥ కుండలమండితగండయుగళుడై - అండాతాండవంబాడుచున్నాడు॥గ॥ అల్లశ్రీవేములపల్లెవినాయకు - డల్లానాతాండవంబాడుచున్నాడూ॥ గణనాథు॥

తరంగము॥ ఝుంకిట్ట ఝుంకిట్ట షణ్ముఖాగ్రజా । ధోంకిట్ట ధోంకిట్ట ధూర్జటితనయా। ధాంకిట్ట ధాం. ట్టబయగనుగొనుమని । ముజ్జగములనుమొక్కినుతింపగ। గుజ్జురూపమునకో రెక్కలాసంగుచు । బొజ్జనటింపగభోగిహారములు। గజ్జెలుపదములగల్లని మ్రోయగ। యజ్ఞకీసురలింపుతో డుతను । యొజ్జయటందునుయొప్పగుజాజులు। గొజ్జగిపువ్వుల గొనిపూజింపగ । సజ్జలవేములపల్లెసుబ్బకవి। బుజ్జగింపుచునుభువిగణనాయకు।డాడుచున్నాడు॥

వ॥ తదనంతరంబు॥ దరువు-ఆదితాళము- శేగుప్తిరాగము.

ఆడుచున్నాదిభారతీ- నామదినృత్యము- లాడుచున్నాదిభారతీ - ఆడుచున్నదిముక్తాహారములునెదజారనెంతో - వడుకలుదనరారగోటవీణేమీటుచుకోరినృత్యము॥లా॥ పలుకులనునమృతంబులొలుకాగ - మోమునాకపురా - తళుకుమునుముద్దుగులుకగా - దళుకుచెక్కులయందు వజ్రతాటంకారోచులు తళుకుతళుకురనచతురపారసమూ జిలుకబెళుకుచూపులనృత్యము॥లా॥ మొల్లవిరులుశిగనజుట్టి- సొగసైనయాణిముత్యములసొమ్ములబెట్టి - అల్లనల్లనధరశ్రీవేములాపల్లెహరిసుతురాణనిజపద- పల్లవంబులగజ్జలందెలుగల్లుగల్లనమోయనృత్యము॥ లాడుచు॥

తరంగము॥ తకిట్టకిణంధిమి- తాకిట్టకిణంధిమి- తాతాకిట్టధిమి- తాళమానముల - పున్నమచందురుబోలు మోమునకు - తిన్నవికపురపుతిలకముజార

గ- కన్నులఁబసొగసటుకాటుక మెరయఁగ- జన్నులముత్యపుసరులుచిక్కు-పడ - వె
న్నునఘనమగు వేణిజలింపఁగ- సన్నపునడుమునుజవ్వాడంగను - పొన్నపువ్వువెలె
పాక్కిలిగన్నడ - నెన్నుదుటను పెన్నెరులునటింపఁగ - క్రన్ననశ్రీవెంకటసుబ్బక
వీఁ - మన్ననబో్రిచుచుమందహాసమున - పన్నుగ వేములపల్లివాసుడౌ- వెన్నుని
కోడలు వేడుకనృత్యము॥లాడూచున్నాదిభారతీ- నామదినృత్యము॥ లాడు॥

క॥ యీరీతిఁ నటియించెడు । భారతినిఁ విష్ణుపతినిభక్తిఁగొలచియుఁ ।
ధారుణి వేములపల్లెవి । హారికిఁ శ్రీతిద్ధృతి వెంకటాచలపతికిఁ ॥ వ॥ సమర్పితంబు
గానాయొనర్పంబూని నయుషాపరిణయంబను యక్షగానప్రబంధంబునకు
కధాక్రమం బెట్టిదనినా॥ కధాప్రారంభము-

ద్విపద॥ శ్రీశుకుగనిపరీక్షిన్మహాధాత - ణీశుండుకడుభక్తినిట్లనిపలికె-
పరమమునీంద్రయబ్బాణాసురేంద్రు - కరములుహరియాలఖండించెనదియు- వి
నుపింపుమనమునివిభుడిట్టులనియె- వినవయ్యరాజేంద్రవిశదంబుగాను - తెలిపెద
శోణనదీతీరమునను కలితమాణిక్యసంఘటితవిచిత్ర - ప్రాకారగోపురప్రాసా
దగేహ - శ్రీకరోచ్చ్యాపరాజితదీర్ఘ కలను - సొంపొనదుధరణిపైశోణపురంబు
యింపుతోతత్పురంబేలుచునుండు - బలవంతులగుదైత్యభటులర్థిగొలువ- బలిత
నూభవుడైనబాణాసురుండు యితడొకర్నాడు జాధిపత్యమున- హితమంత్రి
వరులనుసింపారనిల్పి- శోణాద్రికేగియుసుస్థిరత్వమున - స్థాణునిగూర్చియుతన
మనంబునను - చపలతలేనట్టిసద్భక్తితోడ తపమాచరించియాతడు కేయుబగలు
జోకతోదనదైనశోణపురంబు- వాకిటనిల్పికావలియుండవరము - రహిగాంచిని
జమనోరధసిద్ధిబొంది- మహినివేములపల్లెమాధవువలని - భయమువమానియుని
జపట్టణంబునకు- పయనమైతనవార్తపౌరులకెల్ల - వినుపింపబొమ్మని వేవేగ బను
పజనుడెంచెచోబ్బారిసరభసంబునను॥

చ॥ కలికితురాయిమేల్పాగసుగన్గినచిల్కుపేట్పమాలమెు । గ్గలతెలివిని
ల్వటంగిజరికమ్ములకాల్నడికట్టుకట్టులో । పలపిడిబాకుచాతవాకబంగరుబె
త్తముపూనివచ్చెబల్ ।విలసితవృత్తిశోణపురివీధులబూచుచుచోపుదారియుఁ॥

దరువు-ఆదితాళము-తోడిరాగము.

వచ్చెనిదుగోచోపుదారీ - హెూయలుమీరి - వచ్చెనిదుగోచోపుదారీ॥
వచ్చెనిదుగోచోపుదారీ - హెూముఽమీరాబాణాడిదిగో - వచ్చెనని పౌరు
లకూ- హెచ్చరికెదెల్పూచు వేగా॥వచ్చె॥ యెత్తివకోపాముతోదా- మత్తూనై
నవారిచేతీ- బెత్తామున మొత్తూచూప- ర్వెత్తూచూబలత్తుమిరా॥ వచ్చె॥ మీసా
మూదీటుచూశ్రీనివాసూడౌవేమూలాపల్లె - వాసూనిదలచినావారి - రోస
మూనదండింపుచు॥ వచ్చెనిదుగో॥

క॥ యీరీతిశోణపురంబున్। జేరంజనిచోపుదారిచిడిముడితోడన్। పౌ
రజనంబులదగగన్గొని। ధీరతనిట్లనియెసకలదిసలద్రువంగన్॥ వ॥ ఓహోహోమంత్రు
లారా, వోహోహో సామంతులారా, వోహోహో సేనానాయకులారా, వోహోహో
దండనాయకులారా, వోహోహో భటనటగాయకులారా, వోహోహో బ్రహ్మక్షత్ర
వైశ్యశూద్రాదిపౌరవర్గంబులారా, మనప్రభుండైనబాణాసురేంద్రుండు- శో
ణగిరిశృంగంబునస్థాణుంగూర్చితపంబాచరించి - యతనిచేనిష్టార్థంబులువడసి-
మహోన్నతబలుండై పురంబునకేతెంచుటకు ప్రయాణంబైయున్నవాడుగా
వున-మీమీగృహంబులున్ను-కోటలున్ను, పేటలున్ను, వీధులున్ను, విపణిమార్గం
బులున్ను, రాజమార్గంబులున్ను, రచ్చకొట్టంబులున్ను, కొల్వుకూటంబులున్ను
యింకాతక్కినప్రదేశంబులన్నియుకస్తూరిచే బూయించిశిస్తుగా చిత్తరువులు
వ్రాయించి, శ్రీగంధతోయంబులుజిలికించి, ముత్యాలముగ్గులుపెట్టించి, మణి
మయకేతనంబులెత్తించి, మకరతోరణంబులుగట్టించి, చలువచప్పరంబులెత్తిం
చి, చలివెంధరలుబెట్టించి, యీరీతినపురంబతిశృంగారంబుగావింపరోయీ॥

వ॥ మంచిది అలాగెగావించియున్నామోయి చోపుదారీ॥

ద్విపద॥ అంతబాణాసురుండధికసంతోష, స్వాంతుడైకాంచనస్యంద
నంబెక్కి, హితమంత్రివరపురోహితదైత్యసుభట, వితతులుగొలువంగవేవేగ
వచ్చి,నిజపురిజొచ్చిమానితపౌరవరుల, గజిబిజిముందరకంచుకుల్ జడియ- నరు
దెంచిమొగసాలనరదంబుడిగ్గి - సరవినంతఃపురసౌధంబుజేరి, స్నానసంధ్యాది
కసత్క్రియల్ దీర్చి - పూభజించితాంబూలంబుజేసి - భవ్యచందనమాల్యభా
సురవస్త్ర, దివ్యభూషణతతుల్ తెరగొప్పదాల్చి - వదలకభటులకైవారముల్
సేయకుదురైనముత్యాలగొడుగులనీడ - ధరణివేములపల్లెధాముడైనట్టి - హ
రిమీదిమచ్చరమతిశయింపగను- శుభసంబుమీరయారాక్షసేశ్వరుండు- సభజార
పరివారసహితుడైవెడలె॥ దరువు-ఆదితాళము-తోడిరాగము.

బాణాడీడుగోవచ్చె ప్రలయభైరవుడోయనంగన్- స్థాణునిచేవరము
గాంచిసరభసముమించి॥బాణాడీడిగో॥ భటులాచటులార్భటులచేదీక్షటులా
టిటులాబెటలా పటహఢక్కాఢమరూభేరిభాంకృతులెసగగా॥ బాణాడీడు॥

వ॥ యిట్లువచ్చిసభామంటపంబుప్రవేశించి చోపుదారింగాంచి బా
ణుండిట్లనియె- అహాహోవోరీచోపుదారీ॥ అనినచోపుదారీ॥ బుద్ధిపరాకుఅసుర
వంశపయఃపారావార రాకాసుధాకరాత్రిలోకభీకరా శాత్రవాంధకార
ప్రభాకరాబుద్ధిపరాకు యేమయ్యాస్వామీ బాణాసురేంద్రా॥ అనినబాణుం
డు॥యీకొల్వుకూటంబునకు సమస్తపరివార జనంబులందరున్ను వచ్చి
యున్నారేమిరావోరి చోపుదారీ॥

గురు-పురోహిత-ప్రధాన-సేనానాయక- దండనాయక- అవసరిక ఘటక సిద్ధార్థరక-రాజవైద్య-రణవైద్య-భూతవైద్య- విషవైద్యమాంత్రిక- చామరిక స్వర్ణకారక-లోహకారక-చర్మకారక- ఫణిహారక-పరిహాసక- భట- నట-గాయకా - ద్యఖిలపరివారబృందంబులందరున్ను వచ్చియున్నారయా స్వామీ బాణాసురేంద్రా॥ మదీయసింహాసనం బెచ్చటయున్నది రావోరీ చోపుదారీ॥ యిదుగో యిచ్చటనే యున్నది కూర్చుండి స్వామీ॥

ధరువు-అటతాళము-తోడిరాగము.

బాణుండు కొలువాయెను వైభవమున। బాణుండు కొలువాయెను॥ బాణుండు కొలువాయె భటనటగాయక - శ్రేణులిరుగడలందు సేవింపుచుండగా॥ బాణుండు॥ అతులిత ప్రభులారగా వింజామర। లతివలు తగవీవగ హితమంత్రివర పురోహిత భృత్యామాత్యసంతతులు గొల్వగ। పద్మహితతేజుండగుచును॥ బాణుండు॥ అచ్చావుభయభక్తి చేకంచుకులెల్ల। హెచ్చరికేలు దెల్పగా। యిచ్చా వేములపల్లె యీశూడౌహరిమీది। మచ్చారమచ్చగా హెచ్చుచునుండా॥ బాణుండూ॥

యిట్లు కొలువై చోపుదారితో నిట్లనియె। అహాహా వోరీ చోపుదారీ। బుద్ధిపరాకు యేమయా స్వామీ। ఛప్పన్న దేశంబుల రాజులందఱును తప్పక నాయాజ్ఞననుసరించి వర్తింపుచున్నారేమి రావోరీ చోపుదారీ॥

అనిన చోపుదారి వచనము॥ సీ॥ దానవేశ్వర నీప్రతాపంబుకు నోడియినుడభ్రముల మాటున నజరించు। ఘనమైన నీధైర్యమునకోడి హేమాద్రి తనశిరంబద్రిలో దాచుకొనియె। సరిలేని కీర్తిచంద్రికేలకు నోడి పగలయి నశశియు గన్పడక తిరుగు। ధరణిపై నీదైన దాతృత్వమున కోడి కర్ణుండు చూడ వివర్ణుడయ్యె। పాకశాసనముఖ్యదిక్పతులు నీకు। నదరిబెదరి యుమాలలకొదిగి రితర। క్షితిపతులు నీకు నెదురించి బ్రతుకగలరె। అసురకులర్థిచంద్ర బాణాసురేంద్రా॥ గావున దేశంబుల రాజులం జెప్పగనేల ముప్పదిమూడు కోట్ల దేవతలయినను నీపేరువిన వడవడ వడంకుచు మాలల మాలలకు దూరుచున్నారయా స్వామీ బాణాసురేంద్రా॥

క॥ అనిగొబ్ధారియు బల్కెడు। వినయోక్తులకలరి దైత్యవిరుడు మోదంబున కొలువుదీరియుండెను। ఘనతర వరగర్వమాత్మ గడలుకొనంగ॥

బాలయుషాకన్య తండ్రిదగ్గిరకు వచ్చుట.

బాలఉషాకన్య వేషకథ-ద్విపద-భైరవిరాగము.

అంతట బాణునియనుగు కుమారి। కంతుచేతికటారి కలికిమిటారి। బాలపల్లవపాణి పరభృతవాణి। నీలాహిసమవేణి నిత్యకల్యాణియైన యుషాకన్య యానందభరిత। మానసయై తండ్రి పాలికి బోవ। మదినెంచి పన్నీట మజ్జనంబాడి పదపడి చంగావి పావడగట్టి। వెలిపట్టు శామంతివిరిచల్వచీర। సలలితంబుగ గట్టి జల్తారు

గోటు-రవికెయుదొడిగివిరాజితంబైన - నవరత్నములతోడనా నెహారుచుల-ప్రాకటంబయినపాపటబొట్టుమొగలి-రేకునునెలవంక రేకణీబిల్ల అందమవుజడబిళ్లలపరంజికుప్పె- సుందరంబైనట్టిసూర్యచంద్రులును- బుగడలుపల్లెరుపువ్వులుచిలికి- మగరాలకమ్మలుమంచిముత్యాల- ముడుగులుమాణిక్యములకీలునత్తునురిపెణలునుకంఠసరిమొలనూలు - కరకంకణములుకేల్కడియముల్ డాబుయరుదైనచౌకట్లుయపరంజితట్లు- సందిదండలును బేసరిబాజిబందు- అందెలుగజ్జలునాదిగాగల్గు- సొమ్ములధరియించిసొగసుటద్దంబు- నెమ్మితోగనినెరనీటుగాకపురతిలకంబుదిద్దియుతరవవాసించు- కలపంబుబూసియుకమ్మవాసనల - జాజులుసంపెగల్జడనిండజుట్టిభోజనంబొనరతాంబూలంబుజేసి - పదపదడివేములపల్లెకేశవుని- పదపద్మమునుమది ప్రస్తుతింపుచును సుమహితమతితోడసుందరీమణియుక్రమమున తనచెలికత్తెలకనియె॥ దరువు ఆదితాళము-రేగుప్తిరాగము.

పోదముపదరెపొలతులారా మాతండ్రిసభకూ॥ పోదాముపదరెపొలతులారా - పోదాముపదగోవాపొలతులారమర్యాదతోడ మాయయ్యకొలువునకు॥పోదాముపదరె॥ మబ్బాకంటిరోనినునాటకూటా - మాతండ్రివేళావచ్చికొల్వునయున్నదాటా- అమ్మాగమనమిపుడాదుకొనుటకును - అచ్చనగాయలుఇచ్చి ఋమ్మనవచు॥ పోదాముగొమ్మా వేమరాలపల్లెశౌరి - పదపద్మములెదలో- నమ్మిమాతండ్రిచంతాజేరి- అమ్మాపొడవు వెలసొమ్ములుగొనిమన- బొమ్మలపెండ్లిరమ్మనిపిలుతామురా॥పోదాముపదరె॥

క॥ వనజాక్షులారానాదగు। జనకుండగుబాణుడున్నసభయటుగలదో। అనుమానిమింతలేకను। వినుపింపుడునాకుదెలియవిశదముగాగన్॥

వోకొమ్మలారా మాతండ్రియగుబాణాసురేంద్రుని కొల్వుకూటంబుయచ్చటయున్నదో చూపరమ్మా॥ యిదుగోయిచ్చటనేయున్నది చూడవమ్మాయుషాకన్యా॥ అనినయుషాకన్యా॥ దరువు-అటతాళము-కాపిరాగము.

యంతాసుందరమేయీకొల్వు।జీవాదంతాపూవాకేళ్ళ। వింతాగున్నాది॥యం॥ బాగైనగచ్చుటరంగులే।పద్మా। రాగకవాటవిరాజితమైయున్నా॥ డెంత॥పగడాలాచాల్పైగంభములే। చిలికి। మదరాలబోదెలవంగరినాదూలములే॥యంతా॥ మోశేటిఘడియారములే। పిలి। ప్రాశేటిగనికాలేఖకసముదాయములే॥యంతా॥పండితకవిసంభావితమే। గుణమండితమంత్రిసామంతసేవితమే॥యంతా॥ నవరత్నఖచితతోరణమే। యీ। యవనీవేములపల్లెహరిరాణిగృహమే॥ యంతాసుందరమే॥

క॥ అనిసభవిభవంబెన్నుచు। వనజేక్షణకొలువుజొచ్చివనితలుదానున్। జనకునికడకేతెంచియు। తనకరములుమోడ్చిపలికెతద్దయుప్రీతిన్॥ గీ॥ శరణుశ

మ్మపన్నీట । కరములు మోమును కాళ్లనుగడిగి । జిగిబురుసావన్నెచీర తాఁగట్టి। బిగువుచనుబ్బులుపిక్కటిల్లగను। రామనుష్యత్వరకుట్టురవికె తొడిగి। సోముని గేరెడుసొగసుమోమునను । కస్తూరిమిశ్రితకర్పూరతిలకంబు। శిస్తుగాతీర్చియు శ్రీగంధమలది। జిగిమించుముత్యాలచికిలిసొమ్ములను। తగునవిధరియించి తారహారములు। జాజిపూదండలు జడనిండజుట్టి। భోజనంబొనరించి పొలతిచేవార్చి। పడతులందిచ్చు కప్రంపుబాగాల। మడుపులుంనమలుచు మత్తేభయాన। విరిసినమల్లెలు విరజాజివిరులు మరచివమెత్తనిపానుపుపైన । పాటించి వేములపల్లెకేశవుని। పాటలుంబాడుచు పవ్వళించియుండు। భద్రేభయానలు పావడల్వీవ। నిద్రబోవుచునుండి నెలతుకయొక్క । కలగని మేల్కాంచి కలవరించుండె। కలకంఠి తనచెలికత్తెల కనియె॥

దరువు - ఆదితాళము - విరాళిరాగము.

యెంతమంచిస్వప్నమాయెయింతులారా । కంతుకేళినొకదనన్ను కలశి మెలశియుండునట్లు॥యెం॥ మంచిగంధమలది మేలమల్లెపూలా పాన్పుమీద। నుంచిననులాలించి మరులుబెంచి కౌగిలించినట్లు॥ యెం॥ భూమిశ్రీవేమూలపల్లెధాముని బోలినవాడు। మోము మోమునందుజేర్చి మోవితేనెలానినట్లు॥యెం॥

సీ॥ మెరుంగునీలపుచాయమేనుగల్గినవాడు। అరుదైనకోమరుంపారియంబువాడు। అందమౌజిగిచెక్కుటద్దములుగలవాడు । మొలకనవ్వులముద్దుమోమువాడు। చందనలిప్తవిస్తారవక్షమువాడు। నయమైనశింగంపునడుమువాడు। మిసమిసైనసునుమొలకమీసములుగలవాడు। తొగరేకులనెదుకందోయివాడు। మేటినవరత్నఖచితకిరీటకంఠ । హారకేయూరమణికంకణాంగుళీయ । కలితభూషణుడొకడునాకౌగిటందు। చిక్కినట్లుండియంతలోచిక్కకరిగె॥ గీ॥ అట్టిపురుషునిబాసినయంతనుండి। కమ్మవిలుదొమ్మిచేయుచున్నారమ్మా। గ్రమ్మెనీకాకకోర్వలేనమ్మా। విరులలోదోటలో పలదిరుగకున్నా॥ వ॥ ఓకొమ్మలారా యీతాపంబుతీరుటకై మనయుద్యానవనంబులో కొంతసేపువిహరించివత్తము పదరమ్మా॥

సఖులవచనము॥ మంచిదిఆలాగేపోదాము పదవమ్మా యుషాకన్యా॥

గీ॥ అనిసఖులు వెంటరామేడయతివడిగ్గి । కుందచందనమందారకోవిదార।సారఘనసారజంబుజంభీరతరులు। సిరులనొప్పుగృహారామశీమజేరె॥

ఉషాకన్యవచనము॥ సఖులతోనిట్లనియె. ఓకొమ్మలారా మనగృహారామంబుజేరవచ్చితిమిచ్చట మచ్చికతోవిహరింతాము రారమ్మా॥

దరువు - శంకరాభరణం - అటతాళము.

షాలతులారా ఈపొదరిండ్లలో పలచలగి బొమ్మలపెండ్లి సేయుదామా॥ తియ్యనిపండ్లుపూదేనెబుగొనివచ్చి వియ్యాలవారికి విందులుపెడుదామ॥ యింతులారాగున్నచింతలనీడల పంతమతో పూలబంతులాడుదామ॥ తీగెలుకొమ

లతూగావేసి మనముబాగుగనుయ్యాలలూగుదాము ॥ పాటించివేములపల్లె శ్రీహరిమీదిపాటలుబాడుచు ఆటలాడుదాం॥

వ॥ ఓకొమ్మలారా యీవిచిత్రంబేమోచూడరమ్మా॥

సఖులవచనము॥ ఆవిచిత్రంబేమోచెప్పవమ్మాయుషాకన్యా॥

ఉషాకన్యావచనము॥గీ॥ చిలుకపలుకులు చెవులకుములుకులయ్యె। కొమ్మతుమ్మెదరొదతలదిమ్ముబట్టె। చల్లగాలికితనువెల్లజల్లువనియె। యెవ్విధంబునవిహరింతునివ్వనమున॥ దరువు - ఆదితాళం - భైరవి.

కలకలబలికెడు చిలుకలబెడిదవు పలుకులుచెవులకుములుకులాయెన యొగ్గె-నేతాళలేనమ్మావో యమ్మా॥ కొమ్మలారఝుంఝుమ్మరనెడు కొదమతుమ్మెదరొదతలదిమ్ముబట్టెనయ్యొ॥ నే॥ అల్లనవేములపల్లెశ్రీహరితోడు చల్లనిగాలిజల్లుజల్లనేతనువెల్ల॥ తరంగము.

తజ్ఝణుఝుణుతక తాండవకృష్ణా కిట్టకకిట్టకకిన్నరపక్షా । ధిమితక ధిమితకదీనాధ్యక్షా తుకుందకుందకుకుందకిణంజరరక్షా । సరోజభవసురాలి మస్తకకిరీటతటపద్మరాగవరరుచి।విరాజితముఖాముకురారిసిపడ । సరోజయుగముంచరా నాదుహృత్సరోజమునయనిస్మరింతునను బ్రోవరా॥ కరుణజూడ రాసుబ్బకవి । వరను తానీమురళిధ్వనివిని । కరాళమగుమరునరాళికోర్వకవిరాళిగానినూ। వురాలుముత్యాలసరాలుగదలత్వరానవచ్చిన మరాళిగవనల స్మరాహవంబున।తిరానగూడినపరాత్పరాబహు॥పరాకువేములపల్లెనివాసా॥

వ॥ ఓచంద్రవదనా నన్నుద్యానవనంబునకుం దోడ్కొనిపొమ్మనిచెప్పితెమన్మథుండు దండువిడిచిన వీడుపట్టునకుదోడ్కొనివచ్చితివెంతపగడాయువైతివమ్మాతల్లి॥ సఖివచనము॥ అదియేలాగో చెప్పవమ్మాయుషాకన్యా॥

ఉషాకన్యావచనము॥సీ॥పూపొదలివిగావుపున్నాగనిభవేణి - మరునిబాణములుండుమంటపములు । చుగురాకులివిగావుభృంగరాజసమమధ్యకంజబాణునిచేతిఖడ్గసమితి । కోమలియివి పికకూజితంబులుగావుకందర్పసైనికకలకలంబు। జలజాక్షియివిభృంగఝంకారములుగావు - మారునిచెరుకువిల్నారిమోత। పుష్పాదులకుప్పలివిగావుపువ్వుబోడి । మదనుడొనగూర్చినతుపాకిమందుగాని। కలికిశృంగారవనమిదిగాదుస్మరుండు।విటులపైదలడువిడిసినవీడుగాని॥ క॥ చిలుకలరథమెక్కియుపిక।కలకలములుచెలగనిక్షుకార్ముకమునపూ । ములుకులువేయుచునదిగో।కలికీమన్మథుడువచ్చెకడురభసమునన్॥ దరువు- నాట.

మరుడుదండెత్తివచ్చెనమ్మ - అల్లదిగోనాపై మరుడుదండెత్తివచ్చెనమ్మా॥ కురంకువింటవిరిశరములునాదగు-గురుకుచములపైగురియుచునదిగో॥ మ॥ కీరవాణిపికకీరశారపరివారములుకైవారముసేయ॥ వం॥ భీమరవంబునపెళపె

నార్చుచు వేములపల్లెనివాసునిసుతుడౌ॥వ॥ ద్విపద-నాట.

కొమ్మరోయదెచూడుకువలయాస్త్రుండు - తమ్మితూడుతుపాకెతాధరియించి-కమ్మవిరిప్పౌడిమందుగట్టించిగండు-తుమ్మెదయనగుండుదోడ్తోడవైచి-రంజిల్లుకోపాగ్నిరాజంగజేసి, రంజకంబిడిరాల్చెరమణీలలామ, సుదతివేములపల్లెసురవంద్యునాన, అదెచూడుగుండుధమాయనిమెగరే॥ క॥ ఇచ్చెలువుననచ్చేడియ। విచ్చలవిడిమరుతుపాకి వ్రేటునగూలన్। ఇచ్చనతిభీతిబొందియు।నచ్చెలిచెలిచంద్రవదనయతివలకనియెన్॥వ॥ ఓయమ్మలారా మనయుషాకన్యపరవశమైయున్నదిందులకుమనకు ముందువెనకేమియుందోచలేదు నేనతిత్వరితగతింబోయి చిత్రరేఖందోడ్కొనివచ్చుచున్నానంతపర్యంతంబికాంతామణింగాపాడుకొనియుండరమ్మా.

చెలులవచనము. మంచిదిఆలాగేపోయిజాగ్రతగారావమ్మాచంద్రవదనా॥క॥ అనియిట్లుచంద్రవదనయు। చనుదెంచియుతద్విధంబుచయ్యనదెలుపన్। వినిచిత్రరేఖయాచటికి। వినయంబునవనరుగుదెంచువిధమెట్లనినన్॥

చిత్రరేఖవేషకథ - ద్విపద.

కుంభాండపరపుత్రికోమలగాత్రి, యంభోజదళనేత్రియమలచారిత్రి, యాళినీలకుంతలయత్యంతచతుర, యళికజిచ్ఛశిరేఖ యగుచిత్రరేఖ, కరమర్థినయ్యుషాకన్యకడకు, నరుగంగదలచియా నళినాయతాక్షి, సరవితోపన్నీటస్నానంబుచేసి సిరిమించుసరిగంచుచీరతాగట్టి, రంగైనమొగ్గలరవికయుదొడిగి, శింగారమైనట్టిచికిలిమానికవు, బంగారుసొమ్ములుపడతిధరించి, సంగనిగేదంగిసంపంగిజాజి, విరిసరుల్శిగనిండవెలదితాదురిమి, సరిలేనిపరిమళ చందనంబలది, నిలువుటద్దముజూచినెలతకస్తూరి, తిలకంబునీటుగాదిద్దిపిదెంబు, సేయుచుప్పైనశీతాంశువదన, పాయనిభక్తిసభరితాత్మయగుచు, పదపడివేములపల్లెకేశవుని, పదపద్మములుమదిబ్రస్తుతింపుచును, గ్రచ్చరనయ్యుషాంగనకడనుండి వచ్చినిల్చినచంద్రవదనకిట్లనియె॥ దరువు - ఆదితాళము.

ఏలరమ్మనేనమ్మ॥ యే॥ యాలయాలవోనీలవేణియా - బాలామణితనపాలికిరమ్మనుటేలారమ్మనేనమ్మ॥ మాటిమాటికిఆటలాడగను-మరు- మాటలాడగనేలారమ్మనేనమ్మ॥వేములపల్లెనివేశునితోడు- యకోరిమలి ననుదోడ్కొనియిటురమ్మనుటేల॥

క॥ మెచ్చటనున్నదయాసతి।ముచ్చటలేమేమిదలచెమగువా నీవున్।వచ్చినతెరంగుదెల్పుము। వచ్చెదనీవెంటనేనువనజాతముఖీ॥ వ॥ ఆయుషాకన్యయెచ్చటనున్నదో చెప్పవమ్మా చంద్రవదనా.

చంద్రవదనవచనము॥ ఉద్యానవనంబులోనున్నదమ్మాచిత్రరేఖా.

చిత్రరేఖవచనము - దరువు - రేగుప్తి. ఆదితాళం.

పదపదపద వేపద్మగంధిపోదాము వేగ॥ ప॥ పదపదపదసమ్మదమెదబొద వగ- ఇదుగొావత్తుయమ్మదవతికడకును॥ ప॥ నదువ వె వేగనళినవేత్రిజారినవిరులు ముదువ వేచారుమోహనగాత్రిపడతిగుణములు యెప్పుడుచూడమెయొక- గడె తడవై తేచిడిముడిపడునిదె॥ ప॥ సందేహమేల నేబాల- వేములపల్లె- శౌరిసాక్షిగనీ వేళ- ఇందువదనమదియందుదలంచిన- సందియమేనొాక క్షణమునదీర్చెద॥

వ. ఆయుషాకన్యయుండు యుద్యానవనం బింకాయెంతదూరమున్న దో చెప్పవమ్మాచంద్రవదనా. చంద్రవదనవచనము. ఇదుగో యిచ్చటనే యున్నదిచూడవమ్మా చిత్రరేఖా.

చిత్రరేఖవచనము - దరువు - ఆది - రేగుప్తి.

వనమెంతసొగసమ్మా। ఈయుద్యాన। వనమెంతసొగసమ్మ॥ వనమెంత సొగసమ్మ। వనజాతదయనేత్రిఘనతరపక్షి జీవనమింద్రునందన । వనముకన్నను యాకుబేరుని। వనమునకన్నను చెన్నుగలదీ॥ వన॥ కన్నెమావులప్రోవులు । యా చెంత। చెంగర్వరేకులబావులువున్నతమగుసురపొన్నతరుల బెన్న। గొన్నమంచి తెలిగన్నెరుపొదలలో। పన్నెమీ రెడివువ్వుపొడి। దిన్నెలెన్నోగలవుయీ॥ వ॥ పందిటద్రాక్షలును। యానీడల। పటికంపుటరుగూలును। అందమైనశ్రీచందనతరు వుల। సుమనబరాసినకుందలతలగృహ । బృందములయందంబుపరిమా । నంద మొందును డెందమునకీ॥వ॥ పాటలీతరువులనుయీచంగట। పన్నీటికాల్వలును। పాటలాధరులారా పాటింపయీవన। వాటివేములపల్లెవాసుడౌహరిమీది। పా టలాడుచుఆటలాడుచు। బోటియిటచరియించునో॥ వన॥

వ. ఈయుద్యానవనములో నాయుషాకన్యయెచ్చటనున్నదో చూపవ మ్మాచంద్రవదనా.

చంద్రవదనవచనము॥ ఇదుగో ఈచంద్రకాంతవు టరుగుపయి పవ్వ ళించియున్నదిచూడవమ్మా చిత్రరేఖా.

క॥ అనియకెంగేలుమలిచెలుపగ। వినిచనియాచిత్రరేఖవివశత్వంబున్। గ నియున్నయుషాకన్యన్। గనుగొనియిట్లనియెభీతిగడలుకొనంగన్.

వ. ఓయుషాకన్య, ఓయుషాకన్యా, ఓయుషాకన్యా.

దరువు - పరూరువ - ఆదితాళము.

పిలిచినపలుకవేమే। బిసరుహపాణి। నాపయి। అలిగినకారణమేమే। అళినీ లవేణికన్నులందునీరునించకారణమేమే వోకన్నతల్లి నిన్నెవ్వరు గాసిపెట్టిరే॥ పిలి॥ కర్పూరగంధిరో మోముగందు టేమమ్మా। నిట్టూర్పు వేడివాడెనధరోష్ఠమే మమ్మా॥ పిలి॥ పొంకముమునతనువుశగలబొగులు టేమమ్మా। రత్న । కంకణముల

లక్కనీరయికరగు చేసమ్మా॥ పిలి॥ పులకింత దేహముయేమితలచుకొంటివేని।ప
లుచనీగంధముపటలీపలుకక త్తెనేమే॥ పిలి॥ ఇలనుశ్రీవేములపల్లెయూశుసాక్షిగా
వో। కలికినీము త్యాలసరులుగందు చేమమ్మా॥ పిలి॥

గీ॥ వెలదివచ్చినట్టి వేళావిశేషమో। చెలియద్రొక్కినట్టిచెట్లమహిమొ।
నెలతబండియున్న నేలమంచిదికాదో।చూచిచెప్పవమ్మసుందరాంగి॥ వ॥ ఈయు
షాకన్య యెంతపిలచినాపలుకకయున్న దిందులకు హేతువేమో కరంబుబట్టినా
డీపరీక్షించిచెప్పవమ్మా చంద్రవదనా.

చంద్రవదనవచనము॥ అదియేలాగోనీవేచూచిచెప్పవమ్మాచిత్రరేఖా.

చిత్రరేఖవచనము॥సీ॥ వామాక్షి నెమ్మోముపాడినయట్లుందికమ్మనిపసి
టగదుగరమ్మ। జలజాక్షి మేనెల్లచమరించియున్నది విరిగొమ్మసురటిచే విసరర
మ్మా। తరణికిమదనభూతముసోకినట్లుందిపరగపుప్పొడిభూతిబట్టరమ్మా। కలకంటి
యే మేమొకలువరింపుచున్నది కట్టగేయుకరకుకంకణంబు। కలువరేకులగప్పరే
కన్నురోయి। పల్లవంబులబోదవరేపదతలములు। తరుణికరములనిడరె కెందమ్మివి
రులు। చెవులకపురంపుకణికలుజేర్పరమ్మా॥ వ॥ ఈరీతిన శైత్యోపచారంబులుగా
వింపరమ్మా॥

చంద్రవదనవచనము॥ మంచిదిఆలాగేగావించియున్నామమ్మా చిత్రరేఖా.

ఉషాకన్యవచనము॥గీ॥ ఇటుల శైత్యోపచారంబులిందుముఖులు। సేయగా
నెట్టగేలకుతోయజాక్షి।కన్నుగవవిప్పితనచుట్టుగ్రమ్మియున్న। కన్యలనుగాంచి
యయ్యుషాకన్యబలికె॥ వ॥ ఓకొమ్మలారా యీశరీరంబునరచి నేనెంతతడవు
నిదురబోతినమ్మాతల్లి॥

చిత్రరేఖవచనము॥క॥ అక్కాయెక్కడినిద్దుర। నిక్కముమదిదాచనేల నీకౌ
గిటిలో।చిక్కినపురుషునిగానక। వెక్కసమునబయిలు వెదకు విధముగదోచెన్॥
వ. నీకౌగిటిలోపలం జిక్కినపురుషునింబోగొట్టుకొని బట్టబయలు వెదకి
నట్లుగానీమనోభావంబు దెలియబడుచున్నదదియేమమ్మా యుషాకన్యా॥

యుషాకన్యవచనము॥ నామనోభావంబునీకెట్లుదెలిసెనమ్మాచిత్రరేఖా.

• చిత్రరేఖవచనము। గీ॥ మోముజూచినయంత నేభామనాకు। నీమనోభావ
మంతయునిశ్చయముగ। దెలిసెనమలకరుచులనుదిగకలోతు। లేనుజెప్పటమెరు
గవేముందువదనా॥వ॥ ఇట్టినాకుంజెలియనిమర్మంబుగలదేమమ్మా నిర్మలాంగీ.

ఉషాకన్యవచనము - దరువు - శంకరాభరణము- ఆది.

ఏమనిదెల్పుదునేనీతో యేమనిదెల్పుదునే। ఈభామలలో మానభంగ
మానుయింకేమనితెల్పుదునే॥ మెండమాపులగన్గొని- పొరు- నిండేరులనకొని
నోరెండినిరాశ।పర్వెత్తినట్లాయెనిం॥ కేమని॥ పాటించిచూడగానునగు।బాటా

యనేమి సేతువో బోటివడగండ్లమూటాయె ఆవరాట॥ యేమనీ॥ పుడమిలో శ్రీవే ములపల్లెపుండరీకాక్షుతోడు। కారడవిగాచినవెన్నెలాయె నావయసు॥ యేమ॥

వ. ఆవిధంబేమని చెప్పుదునమ్మా చిత్రరేఖా.

చిత్రరేఖవచనము॥ క॥ కాంతా నీ ప్రియసఖినిఁ। గానా నీతోడనాడగా ననుదినముఁ। రానాపో నా మెరుగనె। మానినినా చెంతయింత మర్మంబేలా॥

వ. కావున నీయంతరంగంబునంగల తెరంగు మరంగు బెట్టక నాకెరుగింపవమ్మావో కురంగాక్షీ.

ఉషాకన్యవచనము. అయితే చెప్పెను వినవమ్మా చిత్రరేఖా.

చిత్రరేఖవచనము. ఏలాగూ చెప్పవమ్మా యుషాకన్యా.

ఉషాకన్యవచనము॥ క॥ చిత్తరవు మేడలోపల। మెత్తని పూవాన్పునందు మేదిని నిద్రా। యుత్తమతితోడనుండియు। యుత్తరికలకంటి నొకటియంభోజాక్షీ.

దరువు - అటతాళము - ముఖారి.

కలకంటినమ్మా - ఈరాత్రి నే కలకంటినమ్మా - కలకంటినమ్మావో కలకంటి రాత్రిచు· కళల రేనికన్న చక్కనివాడొక్కడు నాదు - మొలకచన్నొకలంటిచెక్కులు ముద్దుగొని రతిగూడినట్లు॥ కల॥ తరుణి వినవమ్మా నామనసెంతో మమరులాయెకొమ్మా - మరుకన్న నలకూబరుకన్న యాపురం - ధరుకన్న మిగులసుందరుడౌ పురుషుడు నన్ను వీరుల పాన్పున జేర్చి పుక్కిటవిడియము సగినయట్లు॥

అతివరో నేను వేములపల్లె హరిబోలువాడు - చతురత్వము నసివిసడలించియును చౌశీతిబంధముల సమరతియుపరతుల- సమ్మతముగ మీరగ బెనకి చెక్కులమరికలు లిఖియించినట్లు॥

ఉ॥ కన్నెడొ వానితళుక్కులు చూ కాటపుయానగు మోము బెళుక్కులుఁ। కన్నుల తేటలుఁ నేనరుగల్గిన మాటలురంబు నీటులుఁ । సన్నపుగౌను కల్పతరుశాఖలబోలెడి బాహులందముఁ । కన్నులగట్టినట్లిపుడు కన్పడుచున్నదీ నాదు చూడ్కికిఁ॥

ద్విపద - ముఖారి.

ఓపద్మనిభనేత్రివో హేమగాత్రి, నాపతి నా విభు నామనోహరుని, యెన్నడు గనుగొందు నెన్నడు విందు, యెన్నడు వానితో నేకమైయుందు, కొమ్మనే కోరిన కోరికలెల్ల, సమ్మతి నెన్నడు సమకూరుచుండు, ఈవిరహాబ్ధి నే నేత ప్రగడతు, ఈవిరహాగ్ని నేనీవట నార్తు, అతివేడ్కపురుషులయాలింగనాది, రతులచేసుఖియించు రమణులు తొల్లి, పుట్టువులందుల పురహరు గూర్చి, యెట్టి పూజావిధులేమేమి వరుస, గావించి పుట్టిరో కాంతాలలామ, భావింపనావంటి పాపాత్మరాలి, కేటికి సిద్ధించు ఘట్టిసౌఖ్యములు, బోటిరో ఈయాడు పుట్టువుగన్న నావసపై పాషాణమై యుంట మేలు, కవగూడి వానితో కలయకయున్న, ఈ ప్రాణమ్ము లేటికి

యీలీరతేల-యీసొగసేటికియీప్రాయమేల - యీవిరుతేటికియీభోగమేల భావింపయీపువ్వుపాన్పులేమిటికి-మరులొందజేసినమగడు లేకున్న - తరుణినాకిన్నివ్యర్థంబులయిదోచె- కన్నెవేములపల్లెకమలాత్ముకరుణ - యెన్నడుగల్గునో యెరుగంగరాదు॥ • దరువు-అట-ఆహిరి.

కలకంఠి వానితో కలసిభోగింపనిచెలువమునాకేలనే॥అమ్మయ్యా॥ అకరాజముగవాడునొక్కి-ముద్దాడని చెక్కిళ్ళుబిగియాలనే॥ అమ్మయ్యా॥ అబ్బరమున వాడదమిపట్టనికులుకు-గుబ్బలనీ కేలనే॥ అమ్మయ్యా॥ తరుణిరోవానిపాదములు వొత్తనినాకరములసొగసేలనే॥ అమ్మయ్యా॥ తోయజాక్షివానితోరతిగూడని ప్రాయమునాకేలనే॥ అమ్మయ్యా॥ అతివ వేములపల్లెహరిబోలుయతనిసంగతిలే నిజన్మమేలే॥ అమ్మయ్యా॥

వ॥ యీపున్నమ వెన్నెలరేనికన్నా వన్నెగల్గిన యీవన్నెకానిమొగం బెన్నడుచూతునమ్మా॥ వోసన్నుతాంగి॥

చిత్రరేఖవచనము॥ యెన్నిదినంబులేమిటికినాదగునేర్పుపంచునస్వర్గమర్త్యపాతాళలోకంబులగల పురుషముఖ్యులనొకరాపటంబున వ్రాసిచూపుచున్నావందులోనిస్వప్నగతుండైనపురుషునింగుర్తించి చెప్పితివేనియీరాత్రివియదమపంబునంబోయినాదగువిద్యాపాటవంబుననతనిందెచ్చి నిచ్చుచున్నానింతపనికైనీస్వాంతంబునచింతసేయవలదమ్మాయుషాకన్యా॥

ఉషాకన్యావచనము॥ మంచిది ఆలాగేగావింపవమ్మాచిత్రరేఖా॥

గీ॥ యిటులచిత్రరేఖయింపుగావిజనప్రదేశమునకుబోయి తెలియనాకరా। పటమువ్రాసితెచ్చిపంకజాక్షికిజూపి । యిట్టులనుచుబలికెనింపుతోడ॥

క॥ మగువావినుమిప్పటమున। తగలనిమగవారులేరుధరలోపలనీ । కగుపతిజూచియునీమది।తగులమిగులయట్టిపురుషతథ్యముచెపుమా॥వ॥ ఈప్రథమావరణంబునవ్రాయుంబడిన స్వర్గలోకనివాసులయిన గరుడగంధర్వ కిన్నరకింపురుషసిద్ధసాధ్యవిద్యాధరమరుద్వసురుద్రాదిత్యాదిగాగల ముప్పదిమూడుకోట్లదేవతలంజూడవమ్మా యుషాకన్యా॥ ఉషాకన్యావచనము.

వీరిలోనాస్వప్నగతుండయిన పురుషుండులేడమ్మాచిత్రరేఖా॥

చిత్రరేఖవచనము॥ యీద్వితీయావరణంబునవ్రాయుంబడిన ఛపన్నదేశంబులరాజులంజూడవమ్మా యుషాకన్యా॥ ఉషాకన్యావచనము.

వీరిలోస్వప్నగతుండయిన పురుషుండులేడమ్మాచిత్రరేఖా॥

చిత్రరేఖవచనము॥ ఈతృతీయావరణంబునవ్రాయంబడిన-జరాసంధ-రుక్మ- కాళింగపౌండ్రకవాసుదేవ- ధర్మలభీమార్జున నకులసహదేవ దుర్యోధనదుశ్శాసన కర్ణ వికర్ణులాదిగాగల రాజలోకంబులంజూడవమ్మా యుషాక

న్యా॥ ఉషాకన్యవచనము॥ వీరిలో నాస్వప్నగతుండయిన పురుషుండు లేడమ్మా చిత్రరేఖా। చిత్రరేఖవచనము - ఈచతుర్థావరణంబున వ్రాయంబడిన యుద్ధవాక్రూరవసుదేవ బలరామకృష్ణులాదిగాఁగలయనువీరులంజూడవమ్మా యుషాకన్యా॥ ఉషాకన్యవచనము.

వీరలో నాస్వప్నగతుండయిన పురుషుండు లేడమ్మా చిత్రరేఖా॥

చిత్రరేఖవచనము - యీపంచమావరణంబున వ్రాయంబడిన శ్రీకృష్ణుని కుమారుండయిన మన్మథునింజూడవమ్మా యుషాకన్యా॥

ఉషాకన్యవచనము-ఓచిత్రరేఖా నీవీపంచమావరణంబున జూపంబడిన పురుషుండును- నాస్వప్నగతుండైనపురుషుండును-వావిరుసలనేమికావలయునో కాని రూపంబొకటిగానేయున్నది మైననుయతనికన్ననితండువయోవృద్ధుండగుటంజేసి నాస్వప్నగతుండయిన పురుషుండుగాడమ్మా చిత్రరేఖా॥

చిత్రరేఖవచనము - ఈషష్ఠావరణంబున వ్రాయంబడినయీమన్మథపుత్రునింజూడవమ్మాయుషాకన్యా॥ ఉషాకన్యవచనము-కందార్థం.

వీడే ప్రాణేశుడు-వీడేనను స్వప్నమందు విధవిధరతులన్ - గూడి నామానధనమున్-చేడెరొ గొనిచనిన దొంగచిక్కెనోయమ్మ ॥ వీనిపేరుజెప్పవేకోవమ్మా - చిక్కెనోయకటనను రతిసొక్కజేయుచు మోవిపంటను నొక్క కౌగిటి ననిమిష ముచిక్కి చిక్కకపోవుదొంగచిక్కెనోయవమ్మా॥ వ॥ వీనికులగోత్రనామంబులేమో జెప్పవమ్మా చిత్రరేఖా॥ చిత్రరేఖవచనము-కందార్థము.

ద్వారకవీనిపురంబును-వరారునికొమరుండుకృష్ణుమనమడువీనిన్ - ధారుణిగలజనులందరు పేరనిరుద్ధుండటండు పిలుతురు చెలియా । అనిరుద్ధుడనిపిలుతురె చెలియా- కలికిచిలుకలకొలికియీతనిఘడియలోపలదెచ్చి - ఇచ్చెదయెలమితోడుతకీలుకడియములిమ్ము పేరనిరుద్ధుడనిపిలుతురె చెలియా॥

వ॥ ద్వారకావాసుండైనకృష్ణునిపౌత్రుండును-మన్మథునిపుత్రుండును-యనిరుద్ధుండను నామధేయంబుగలవాడమ్మా యుషాకన్యా॥

ఉషాకన్యవచనము॥ కందార్థము॥ ద్వారవతియుబహుయోజనదూరంబట పరులుబుపోవదుస్తరమగుచున్। వారాశిలోగలదట। యేరీతింవత్తువతనియిందునిభాస్యా- చెప్పరాకేందునిభాస్యా - నందనందనుయాజ్ఞతీరుగుచునుందురటతలవరులు రేబగలిందుముఖిపరులెరుంగకుండగ యేరీతిందెత్తువతని - యిందునిభాస్యా। చెప్పవేరాకేందునిభాస్యా॥ వ॥ పరులకభేద్యంబయినయీద్వారకాపురంబెట్లు సొచ్చుచున్నావో యనిరుద్ధునెట్లుదెచ్చుచున్నావో చెప్పవె చిత్రరేఖా॥ చిత్రరేఖవచనము-కందార్థము.

బోటివినుమష్టసిద్ధులు - సూటిగనాయందుగలవుస్థిరలీలం - పాటింపగ

తద్విదా- పాటవమునబోయివత్తుపంకజనేత్రి - నన్నంపవేబాణునిపుత్రిబొంకు కాదీరాత్రిశంకాటంకమించుకలేక యన్నాకరాంకసూనునిదెచ్చి నీపర్యంకము ననుజేర్చెదనువో పంకజనేత్రి నన్నంపవేబాణునిపుత్రి॥

వ॥ మోహన స్తంభనవశీకరణసర్వాంజనఆకర్షణవియద్గమన-అదృశ్య గమన శీఘ్రగమనదిగ్బంధనవాగ్బంధనాది విద్యలును - యణిమాద్యష్టసిద్ధులును- నాయిందుగలవు గావున- తన్మహాత్మ్యంబునంబోయి యనిరుద్ధుం దెచ్చుచున్నా నునన్నుంబంపవమ్మాయుషాకన్యా॥

ఉషాకన్యవచనము॥ ఆలాగేపోయివత్తువుపదవమ్మాచిత్రరేఖా॥

చిత్రరేఖవచనము - దరువు - ఆదితాళం - మధ్యమావతి.

మంచిశకునములాయెనమ్మద్వారావతికరుగ - మంచిశకునాలాయెన మ్మ॥అంచితముగనన్నుసుపగతడవేలెంచితివినిలుచంచలలోచన॥ మం॥ బాలా మణిరోచూడవమ్మ- శుభసూచకములు- చాలగనుపింపసాగెనమ్మ- పాలగరుడ దాపలిదిశకేగెను- పాలకడవలెదపకడకెదురవ్వెను॥ మం। కామునిబాణజాల మునకు -చురుకైనచందమామవెన్నెలకెదబడకు - వేములపల్లెనివేసునిమనుమని వామాక్షిరోగానికూర్తునిను॥ మం॥

వ॥ ఓయుషాకన్యా యిదుగోద్వారకాపురంబునకుం బోయివచ్చుచు న్నానునిలువవమ్మాతల్లీ। ఉషాకన్యవచనము.

కార్యంబుచక్క-బెట్టుకొని శీఘ్రంబుగారావమ్మా చిత్రరేఖా॥

వ॥ అనుచు వెంటవచ్చుయుషాకన్యవీటుకొని చిత్రరేఖద్వారకానగర మార్గంబుబట్టిపోయినయనంతరంబా॥క॥ గ్రక్కున నరవిగ్రుంకెనున। ద్దిక్కులవ్యా పించెతమముదివిపైచుక్కల్। పిక్కటిలెపూర్వపర్వత। మెక్కెక చంద్రుండుపిర హులెల్లక బెదరక॥గీ॥ అట్టివేళయుషామోహనాంగిదిశల। పట్టపగలుగవెన్నె లలుట్టిగాయ।పట్టగూడనివిరహతాపంబుకతన। బెట్టుగాచంద్రుగాంచితానిట్టు లనియె॥ వ॥ వోకొమ్మలారాయియర్థరాత్రిసూర్యోదయంబౌచున్నదిదియే మివిచిత్రంబోచూడరమ్మా॥ చెలులవచనం॥ సూర్యోదయంబుగాదుచంద్రోద యంబుగానిబాగాచూడవమ్మాయుషాకన్యా।యుషాకన్యవచనము॥ గీ॥ యిం దుబింబుగాదిదియినుడుగాని। పండువెన్నెలగాదుచిచ్చిరెండగాని। కల్పపువ్వుల తల్పంబుగాదిదియును। స్మరునిపంచమసాయకశయ్యగాని॥

దరువు - ఆది - తోడి.

వోర్వజాలనెలలనామణిపర్వశశాంకుని - పండువెన్నెల - కోర్వజాల వెన్నెలకోర్వజాల- తప్పకనిప్పులుకుప్పలుతనువున గుప్పినగతినాకేప్పుడుదోచె ను॥ వో॥ ధరణివేములపల్లెధామునితోడీ కరుకువెన్నెలచురుకునాకికనే॥

వ॥ అనిచంద్రునుద్దేశించి॥

గీ॥ యేమిరాచంద్రసన్మార్గగామివయ్యా । రాజవయ్యానుసత్కృపారాశివయ్యా । మలినగుణుడయినయట్లునిమాడిక నీదు । మలినగుణ మెన్నటికి నైన మానవకటా॥ సీ॥ శూలినిన్నడవైచికాలదన్నిననాడు సమసిపోవయితివి చందమామ। పర్వకాలములందుపట్టిరాహువుమ్రింగసమసిపోవయితివిచందమామ। గురుపత్నిబొందినదురితంబుననునైనసమసిపోవయితివిచందమామ । చాలడక్షుడొనర్చుచాపంబుననునైనసమసిపోవైతివిచందమామ ॥ పాపకర్ములుధరణిలోపలచిరాయు। రౌన్నతివహిస్తురనేడుయార్యోక్తిదెలియు । వచ్చెనిప్పుడునీవు జైవాతృకత్వ।మొందుకతమునజేసియోచందమామ॥ వ॥ వోకోమ్మలారాయీగురుద్రోహియగు చంద్రునియెల్లుందుగావునమారుండు॥ గీ॥ పడతివినవేశిన ద్రోహిపాపకర్మి। యొడలెరుంగక తిరిగెచెడుగువీడు । మంచిమాటలతోడతావట్టుపడునె। కట్టుగానిమ్మలోక్తులదిట్టకున్న॥ సీ॥ యేరనీకేతనం బేటిపాలయిపోను నీకున్నశరములు నీటగలయు।ఖండించినీవిల్లు గానిగెలోవయివ పలవనీచుట్టాలపాము వ్రింగ। చెలగినీసైన్యముల్ చెట్లపాలయిపోనునీదుగుర్రంబులునింగికెగయు।మదననీతనులెల్లమరిభస్మమైపోనునిన్నువియోగులునిందసేయ । మహిరబోయుక్తుడయినట్టిమంత్రియప్ప । డాసవంబానుభటులునుయనుదినంబుగోలువతిరిగెడు నీకట్లు తెలియబడును। పాపపుణ్యాలమార్గముల్ పద్మబాణ॥ వ॥ అనిచంద్రమన్మథులదూషించి యుషాకన్యచిత్రరేఖంబలంచి॥

దరువు - వరారువ - అటతాళం.

చిత్రరేఖరాకపోయె। శీతాంశునికాక పొండాయె।చిత్రవరాయాద్వారవతిలోచిక్కె నేమో తెలియదాయె॥ చి॥ పోదాయెవో వార్ధి దాటలేదాయెనో వచ్చుచోటవాదాయెనో - వచ్చుచోటవాదాయెనో వారికితనకురాదాయెనింకేమిసేతు॥ చి॥ ధరణిశ్రీవేములపల్లెధాముని సాక్షిగమిన్న - విరిగిమీదబడినయట్లుపరవశవముయెనామేను ।చి॥

సంధిపద్యం॥క॥ అనియిట్లునయ్యుషాంగన।ఘనతరవిరహాగ్నిశిఖలగ్రాగుచునుండక । చనుదెంచెచిత్రరేఖయు । ననిరుద్ధునిమెత్తుకొనుచునాకాశమున నకా॥

చిత్రరేఖవచనము-దరువు।శంకరాభరణము-అటతాళము.

వచ్చితినమ్మా అనిరుద్ధుని-దెచ్చితినమ్మా॥ వచ్చితినీరుద్ధుదెచ్చితినీమదిమెచ్చిబహుమతులేమిచ్చెదవునాకు॥ వచ్చి॥ చింతాజాలించిసిదగయాజ్ఞశిరసావహించి-కంతుజయంతువసంతాదిసౌందర్యవంతులలోమెల్పంతినిచేకొని॥ వ॥పల్లవపాణి - శ్రీవేములపల్లెకేశవునియిల్లములోనసంధిల్లజేసి - మచ్చుజల్లినీదగు పాణవల్లభుచేకొని॥ వచ్చి॥

క॥ వచ్చితివారిధిదాటియు। చొచ్చితిశ్రీకృష్ణపురముసురచిరలీలన్। దె
చ్చితిననిరుద్ధునికి । ముచ్చటతోనుండవమ్మ ముద్దులగుమ్మా॥ వ॥ యిదిగో అనిరు
ద్ధునిందెచ్చితి రేవమ్మాయుషాకన్యా॥ ఉషాకన్యావచనము ॥ యేడమ్మా చిత్రరే
ఖా॥ చిత్రరేఖవచనము॥ నీదగు రాణివాససౌధంబులో జేర్చివచ్చియున్నానమ్మా
యుషాకన్యా॥ యుషాకన్యావచనము.

క॥ తెచ్చితివినామనోహరు । నిచ్చితివి దె ప్రాణములను యింతిరో
నాకున్। మెచ్చితినీయుపకృతికెని । అచ్చగ ప్రత్యుపకృతియునునానే సేయన్॥

వ॥ కావుననీయుపకారంబునకు ప్రత్యుపకారంబు సేయంజాలయీ
యాలింగనంబేయుప్పటికిప్రత్యుపకారంబుగానెంచి యాద్వారకాపురశ్రృంగా
రంబునుయనిరుద్ధునిం దెచ్చినతెరంగును నాకెరింగింపవమ్మా చిత్రరేఖా॥

చిత్రరేఖవచనము॥ క- రాకేందువదనద్వారక ।, వైకుంఠమేయచట
నున్నవారలుసురలే వైకుంఠుడె శ్రీకృష్ణుడు। చేకొనితన్మహిమవేరె జెప్పగనేలా॥
సీ॥ యేతోటలరసిన యేలాలతాచూత కేతకీపటపారిజాతతరులె। యేజనంబరసి
నహే-కృష్ణహేరామకేశవాయనిపలుకకీరరవమె । యేమేడలరసినయింపుగాన
టియించుతరుణులచరణనూపురరవంబె । యేగృహంబరసినయిత్తురరంభాస్తం
భరాజితద్వారవిరాజితంబె। చానయేవీధిచూచినచందమామ। రాలచప్పటిబర
చిననేలసొగసె।అతివతత్పురవిలసనంబజునకైన । యెంచగాతరమానెరాయం
చగమనా॥ వ॥ అట్టిద్వారకాపురంబునిశాసమయంబునంజొచ్చికనకసౌధాగ్రం
బునమణిదీపనిచయంబులువెలుంగ హంసతూలికాతల్పంబుననిజాంగనారతిశ్ర
మంబుననిదురించుయనిరుద్ధునింజేరి యతండుమేలుకొనకుండనచ్చుజల్లి యతని
నెత్తుకొనిపరులెరుంగకుండనాకాశగమనంబున నతిత్వరితగతివచ్చి నీదగుపడక
టింటంజేర్చితినింకయాసుకుమారుంగూడి యిష్టోపభోగంబు లనుభవింపుచుసు
ఖంబుననుండుము యేనీమార్గాయాసంబు దీర్చుకొనుటకై నాదగుగృహంబున
కుంబోయి రేపకడవచ్చుచున్నాను అనుజ్ఞయొసంగుమమ్మాయుషాకన్యా॥

యుషాకన్యావచనము ॥ మంచిదిఅలాగేపోయిరావమ్మా చిత్రరేఖా॥

క॥ యికరణచిత్రరేఖం। గ్రక్కునబోవంగబనిచికడువడిసౌధం। బె
క్కియటమరుకన్నను । చక్కనివిభుజూచియింతిచయ్యనబలికెన్॥

యాలలు— వెన్నవంటివయసునీకయిజన్నిబట్టియున్నదార - వన్నె
కాడానిదురలేవరా- వోవో ప్రాణనాథావలపుదీరరతులనేలరా॥ కాయజునిసా
యకములు- కాయముగాయములాయె- మాయకాడాయిదిగోచూడరా- వో
వో ప్రాణనాథాకాయజునికేళిగూడరా॥ చుక్కబొడుచుసమయమాయె- కు
క్కుటములుగూయసాగె- గ్రక్కునయీనిదురలేవరా- వోవో ప్రాణనాథా-

్రమొకేఁను కౌగిట జేర్పరా॥ సంధి॥ క॥ అనిపలుకఁ యింతిపలుకులు । వినియప్లిన కన్నుదోయివిప్పముదమునన్ । వినుతింపదొణగెనాతఁడు । మనమునవచ్చెల్వరూపమహిమంబెల్లన్॥ దరువు - రాగం - ఆదితాళము.

సయినయీచెలిబోలగలరా- చానలెందైన॥ సై॥ కూరిమితోరతికేళిలోపల-కూడుకున్నమిన్నయెన్నడున్నడన్న॥ సై॥ ౧॥ కలువరేకులబోలు - యీసతి-కన్నుగవతీరూ - మెరుపగునిలువుటద్దములనడగు చెక్కలసీటుమోము - పొందుకందుజెందనిందు॥ సయి॥ ౨॥ చేడెబాహుయుగంబు తామరతూడులనుబోలు-యెంతోవేడుకలరెడునీలమేఘము వేణి తరుచినెంచమించునించుమించు॥ సయి॥ 3॥ పూని వేములపల్లె-శ్రీహరియానయీచాన - సన్నుపుకౌనుతోసరిసేయసింగమునౌను-మారుకటారుమీరుయారుతీరు॥ సయి॥

వ॥ అనియుషాకన్యతోనిట్లనియె॥ క॥ రతివో సారతివో శ్రీ । సతివో పార్వతివో యతనుసంమోహరదేవతవో నన్నిటకేటు దెచ్చితి । వతివా దెల్పుమీవిచిత్రంబెల్లన్॥ వ॥ ఆ తైరంగంతయు నాయంతరంగంబునకు స్వప్నంబు తెరంగు నక్రొత్తయగుచు విస్మయంయితోచుచున్నది యిప్పట్టణనామధేయంబేమో చెప్పవే యొప్పులకుప్పా॥

ఉషాకన్యవచనము॥ యిపట్టణంబు శోణపురంబు స్వామీ॥

అనిరుద్ధునివచనము॥ యీసౌధంబెవ్వరిదే భామా॥

ఉ ... నాదేను స్వామీ॥

అ ... నీనామధేయంబేమే భామా॥

ఉ ... ఉషాకన్యయందురు స్వామీ॥

అ ... నీతండ్రియెవ్వరే భామా॥

ఉ ... బాణాసురుండు స్వామీ॥

అనిరుద్ధునివచనము॥ అతండేకదా యీశ్వరునిద్వారపాలకునిగా జేసుకొనియుండేవాడు॥ ఉషాకన్యవచనము॥ అవును స్వామీ॥

అనిరుద్ధునివచనము॥ నన్నిటకెచ్చెలువునందెచ్చితివో చెప్పవే మచ్చకంటి॥ ఉషాకన్యవచనము.

గీ॥ వినుముప్రాణేశనినుదెచ్చువిధము తెలియ । విన్నవించెదపిమ్మటవిశదముగను । ముందు నాకొకరేయి-డీర్పుముముదముతోడ । సుందరాకారరుక్మిణీసుతుకుమారా॥ వ॥ తద్వృత్తాంతంబంతయు పిమ్మటవిన్నవింపుచున్నానుముందు నాయభీష్టంబుడీర్పుము స్వామీ॥

అ॥ నీయభీష్టంబేమో చెప్పవే భామా॥

ఉ॥ చ॥ తడవికి నేలసన్మదులతల్పమునం గదియించిసీవియున్ । ముడి

సడలించినిమ్మమగు పొక్కిలియందముగాంచి గాంచి పెం । దొడలుదొడల్ బెనంచిచనుదోయకరంబులనుంచికౌగిటన్ । సడలగనీకపట్టిరతిసౌఖ్యముగాంచుము ప్రాణనాయకా॥ వ॥ ఇట్టినాభీష్టంబుదీర్పుము స్వామియనికరంబులంబట్టంబోయినయనిరుద్ధుండు॥

అనిరుద్ధఉషాకన్యలసంవాదము - కేదారగౌళ.

అ॥ అతివరోపయిబడియేంట కేకపత్ని వ్రతుడనేను॥

ఉ॥ అతివలరతులసంతతముగూడుటకన్న వ్రతమమేలా॥

అ॥ పరకాంతపొందుబల్పాపమందురునన్నుబట్టరాకువే॥

ఉ॥ పరకాంతనెట్లయితిపరిణయమేలేదు ప్రాణనాయకా॥

అ॥ శీలముతోపెండ్లిచేసినాడనుకానుతాళరాదలే॥

ఉ॥ తాళినందాక గాంధర్వమునుయీవేళగూడరా॥

అ॥ తాటోటుతనమునీతలిదండ్రులెరిగితే మాటగాదలే॥

ఉ॥ పాటించివేములపల్లె శ్రీహరియుండమాటలేమిరా॥

గీ॥ రతులననునేలవయితేనిరాజపుత్ర । దేనుయితరులవరియించు దానగాను । వేణినురివైచి ప్రాణముల్విడుతునిదిగో । చూడునీపాదములచెంత సుందరాంగా॥ అనిరుద్ధునివచనము-దరువు అసావేరి అచ.

యింత తెగువయాలనే-ఓ॥ యింతిరోనీకు॥ యింత॥ మంతనమునసీదైన మనసు తెలియనంటిగాని॥యిం॥ చాలు చాలునిన్నెడబాయజాలననుచును-బాల నీకుచములబట్టిచానచేతులెమ్ములెమ్ము॥ యిం॥ కీరవాణివేములపల్లె కేశవు నెన్నుచుయీరసంబువిడిచినన్నేలుకొమ్ముకౌగిలిమ్ము॥ యిం॥

వ॥ నేజేయుతప్పులన్నియుమన్నించి హంసతూలికాతల్పంబునకుబోదాముపదవేవోభామాలలామా-బుద్ధిఆలాగేపదండిస్వామీ॥క॥ పంకజలోచన నిటుకర । పంకజముఃబట్టిమృదులపర్యంకమునన్ । పొంకముగజేర్చియామక । రాంకునిరతిగూడెబంధనాదులతోడన్॥క॥ ఉదయాస్తమయములెరుగక । మదవతియుకుమారవరుడుమదనోన్మాదం । బెదబాదలబెనగసతికిం । గుదురుకొనెం గొన్నినాళ్ళకున్ గర్భంబున్॥వ॥ ఇట్లుషాకన్యగర్భంబుధరియించి యున్నయెడనొకరినాడు॥ సంధిపద్యము-బాణుండువచ్చుట॥క॥ అచ్చటబాణుడుదిగ్జయ।మచ్చుగగావించిసురనరావళులెల్లన్। యిచ్చభయమందిరిపురికిన్। వచ్చెన్ భటరథతురంగవారణయుతుడయి॥ దరువు-తోడి-ఆదితాళము.

బాణుడిదిగోవచ్చెనహాహా-దిగ్జయముచేసి-బాణుడిదిగోవచ్చెనహాహా బాణుడిదిగోవచ్చెనహాహా- భవ్యహైమమకుటఘటితమాణిక్యరుచులు- సూర్యమండలంబునిండుచుండ॥బా॥ వేయుభుజములందునొప్ప కేయూరవజ్రకాంతు

లయష్టదిక్కులందు పాయకను వెన్నెలలుగాయ॥ బా॥ ధరణి వేములపల్లెశౌరిదక్కనితరసురనరుల- ధురములోననోడించిదోర్బలంబుచేతమించి॥ బా॥

వ॥ ఇట్లువచ్చి సభామంటపంబుజొచ్చి సింహాసనాసీనుండై చోపుదారిం గాంచియిట్లనియె॥ అహాహా చోపుదారీ చోపుదారీ॥

చోపుదారివచనము- బుద్ధిపరాకు అసురవంశపయః పారావార రాకాసుధాకరా త్రిలోకభీకరా శాత్రవాంధకార ప్రభాకరా నిర్జితసురేంద్రా బాణాసురేంద్రా- మీరు దిగ్విజయార్థంబు పోయియుంటిరిగదా యెవ్వరెవ్వరిని జయించివచ్చితిరయ్యా స్వామి॥ బాణునివచనము॥ మంచిదీ ఆలాగే చెప్పెను వినరా చోపుదారీ॥ చోపుదారివచనము॥ అదియేలాగయ్యా స్వామి॥

బాణునివచనము॥ క॥ పారిరిసురలద్రిగుల్। దూరిరిదిక్పతులు వెరవుతో నా పురుగుల్। జేరిరిభృత్యులగతిమ। ద్భేరీధ్వనివిని నయంతభీతిలివసువుల్॥ వ॥ ఇట్లుమదీయ ప్రస్థానభేరీరవంబునకు వెరచియష్టదిక్పాలకులాదిగాఁగల విశిష్టదేవతాగణంబులునష్టసత్వులై త్రివిష్టపంబువిడిచియిష్టదిక్కులకుంబారి నయిారేడులోకంబుల నాకునీడుజోడుయిపోరాడువీరునింగానక తిరిగితిరిగివేసరి మత్సహస్రభుజాదండప్రచండ కండూతిచాయను పాయంబులేక ఈశ్వరునింజేరి యుద్ధంబునకుబిలిచితినోయీ చోపుదారీ॥

చోపుదారివచనము ॥ అతండేమనిపల్కెనయ్యా స్వామీ॥

బాణునివచనము॥ క॥ వినుమూఢహృదయనీకే। తనమేప్పుడకారణంబధారుణిపైగా। లునపుడునీభుజావళి। దునియగనాయంతవానితోననిగల్గుక॥ వ॥ అనిశివుండానతిచ్చినసంతుష్టాంతరంగుండనైవచ్చితినోయీ చోపుదారీ॥

చోపుదారివచనము॥ మంచిబుద్ధిస్వామి॥ బాణునివచనము॥ ఆహాహా చోపుదారీ॥ చోపుదారివచనము॥ యేమయ్యా స్వామీ॥

బాణునివచనము॥ మన ఉషాకన్యరాణివాసం చక్కగాగాపాడుకొనియున్నారేమి రావోరీ॥

చోపుదారివచనము॥ గీ॥ పోతుటీగైనయుచటికిబోకయుండ। రేయుబగులునుకంటిపై రెప్పలిడక॥ రాత్రుసేశ్వరనీపుత్రిరాణివాస। మరయుచుంటిమి నీయాజ్ఞననుసరించి॥ వ॥ ఇట్లుండగానీకూతురయినఉషాకన్యయకారణంబుగాగర్భంబుధరియించియున్నదేమయ్యా స్వామి॥

బాణునివచనము॥ యేమియథార్థంబుగాచెప్పరావోరీ॥

చోపుదారివచనము ॥ యథార్థంబేనయ్యా స్వామి॥

బాణునివచనము ॥ గీ ॥ కటకటాయామబిడ్డలగనినవారి! కతనందయునపకీర్తిగాంచుకన్న।యుర్విబిడ్డలులేనిదేయుక్తమనుచు। బలుకపెద్దల మా

టలబద్ధమూనే॥ గీ॥ వోరికూపకర్ణ వోరికుంభాండ । వోరిమర్కటాక్ష వోరిరుధిర। వోరికాలనాభ వోరోరిమారీచ । వోరిబలివిరూప వోరిసరభా॥

వ॥ ఓదానవోత్తములారా మనయుషాకన్యరాణివాసగృహంబులో నొకచోరుండున్నవాడట వానింబట్టుకొనిరాండోయి॥

రాక్షసులవచనము॥ బుద్ధి ఆలాగేనయ్యా స్వామీ అనియిట్లు రాక్షసులు బోయి రాణివాససౌధంబులో ననిరుద్ధుంగాంచియిట్లనిరి॥

దరువు - శంకరాభరణము - ఆదితాళము.

పట్టుదాము ఈదొంగను-పట్టుదామా-పట్టుదామా ప్రాసపట్టసముల చేపట్టిచుట్టిముట్టియీదొంగను॥ పట్టు॥ మోసము రాణివాసద్రోహం-బాసజేసినదోసకారిని॥ ప॥ పట్టివేములపల్లెశౌరికే- పట్టినపోడట్టిదొంగను॥ ప॥

వ॥ అనిసౌధంబునుచుట్టుముట్టిన దానవసైన్యంబులంగాంచియనిరుద్ధుం డిట్లనియె॥ అనిరుద్ధునివచనము॥ క॥ వోరోరిదైత్యులారా। యారయబాణాసురునకుయల్లుడనేనుగ। జారుడనోచోరుడనో। వారకననుబట్టిన చ్ఛేదరిపుడుగ॥ వ॥ యిప్పరిఘాయుధంబుచే మిమ్మందరచిందరవందరగావింపుచున్నాను రాండోయి॥ తాంతతర్షుణ-అనియుద్ధము॥ క॥ యతడిటువలెనని దానవ। తతులపరిఘాయుధమునవిదళించుటయుగ। యతివేగమెగ్గొనియును। హతశేషులుబారయునియసురాధిపుతోగ॥ రాక్షసులవచనము॥ మనసైన్యంబులందరున్నుయొకమానునిచేత వధియింపబడిరయా స్వామీ బాణాసురేంద్రా॥

బాణునివచనము॥ అయితే నేనేవచ్చుచున్నాను పదండోయి॥

క॥ అని యిట్లుబాణదైత్యుడు। ఘనరతకోపాగ్నిశిఖలుగ్గవగ్రమ్మగ॥ జనికాంతామధ్యగుడై। యనిరుద్ధునింగాంచిబలికె నతిభీషణుడై। వ॥ ఆహావోరిబాలుడా॥ గీ॥ యెండగాయ వెరచునే గ్లిచూచిన। మండవెరచునగ్నిమట్టుమీరి। గాలివీవవెరచుకాలుండుదుదగాని । చంపవెరచుప్రాణిసంఘములను॥

వ॥ ఇట్టిమదీయసేనాసముదయంబులంద్రుంచి యించుకైనసంచలించకున్నావు నీవెవ్వడవురావోరీ॥ అనిరుద్ధబాణసంవాదము.

అ. నీయల్లుడనుమామా॥ బా॥ నీనామధేయంబేమిరా॥

అ॥ అనిరుద్ధుండనుమామా॥ బా॥ నీతండ్రిపేరేమి రావోరీ।

అ॥ మన్మథుండుమామా॥ బా॥ మన్మథుండు యీశ్వరునికంటిమంటచేభస్మంబై పోయివుండలేదేమిరావోరీ॥

అ॥ ప్రద్యుమ్నుండయియవతరించినీసఖుండగు శంబరాసురునిజంపుట యెరుంగవామామా॥ బా॥ నీతాతపేరేమిరా॥ అ॥ శ్రీకృష్ణుండుమామా॥

బా॥ నీవిచ్చటికివచ్చి యెన్నిదినంబులాయెరా వోరీ॥ అ॥ నాల్గునెలలా

యెనుమామా॥ బా॥ ఇన్నిదినంబులేలయున్నావురావోరీ॥ అ॥ నీకూతురునిబంపితే యిప్పుడేపోయి వచ్చుచున్నానుమా మా॥

దరువు - శంకరాభరణము - ఆదితాళము.

బా॥ గొల్లవాడవై మాబోటిగొప్పవారియెదటనిల్చి అల్లునివరుసాలు దెల్పజెల్లునటరా॥ అ॥ వాలాయముగనన్ను గొల్లవాడనిపలికె-వు-కరవాలమున వేతునవీఫాలముబగులు॥ బా॥ అలముననీదుకరవాలము(దుంచియునా - శూలమునునిన్నునేలపాలుజేతునా॥అ॥ నీశూలమునగనెంతనీవెంత - వేములపల్లె యీశుపుండనాకుభీతిలేశముగలదా॥ బా॥ లేశమైననీకుభీతిలేదన్నవిడుతునేనాగపాశముననిన్నుగట్టివేసితిపోరా॥

క॥ చిక్కితి వెకట్టఁడబోయెద। విక్కఁడనిను గాచుకొనగహితులుంగల రాదిక్కుఁ జూచినవిడుతునె॥ గక్కునయహిపాశములను గట్టితినిన్నున్॥

వ॥ అనియనురుద్ధునినాగపాశబద్ధునిగావించి బాణుండిట్లనియె॥

ఆహావోరీచోపుదారీ యీనాగపాశబద్ధుండయిన యనిరుద్ధుండగొని పోయి కారాగృహబద్ధుంజేయరావోరీ॥

చోపుదారివచనము। ఆలాగేగావింపుచున్నానుస్వామీ బాణాసురేంద్రా॥ వ॥అని శెలవిచ్చి బాణాసురుండేగినయనంతరంబయుషాకన్యతద్వృత్తాంతంబాతనునెరింగి॥ క॥ కన్నులబాష్పజలంబులు। చన్నులపై బొరుగవేగజనుదెంచి వెసన్। పన్నగపాశావృతుడై కన్నుంగవమూసిమూర్ఛగొన్నవిభున్॥

వ॥ కనుంగొని యిట్లనివిలపింపదొడంగె॥

ఉషాకన్యవచనము - ద్విపద - ముఖారి.

హాచన్నుధాకారహాసుకుమార- హామేరుసమధీరహారణశూర- హాసుందరాకారయబ్ధిగంభీర- హాసుగుణోదారహాయదువీర - కటకటాహాతండ్రి దిక్కిదినాకుకనుచు పటుతర యహిపాశబంధసంతతుల బంధుకోపసంభరితాత్ముడగుచు బంధించెనేనిన్నుపసిబాలుడనక- నీదుగాంభీర్యంబు నీదుధైర్యంబు నీదుయౌదార్యంబునీదుశౌర్యంబు- నీశాంతినీదాంతినీతనుకాంతి- నీశెయునుతకృతి నీసుకృతియు - నీచిన్నెనీవన్నెనీసొంపుపెంపు - నీచక్కదనమును నేడెందుబోయె-యెత్తినవలపుచెమ్మేగాగిలింప- గుత్తంపునాదైనగుబ్బపోటులకు - నోర్వలేనట్టినీయురమున్నాపైనాటి- దుర్వారశరములుదూరిపోవంగ - యేమనివగచితోయెటుసహించితినో - వేనరుయుపరతివేళయందు - లాలించిమద్భుజాలతలబంధింప- వాలాయముగనుగందువశరీరంబు- బంధురతరనాగపాశబంధముల జంధింపగానెంతపరితపించితివో - మోహనాకారనీముఖవిలాసంబురాహువు(మింగినరాజబింబంబు- గతియున్నదక్కటాకళలెల్లదరిగి- వితతకారుణ్యాయోపి

తాగ్రగణ్యా- తల్లిదండ్రులబాసితమ్ములబాసి - యెల్లబాంధవులనుయెడబాసితి న్ను- తెప్పించిబాణునితీవ్రబాణముల - కోప్పించెనదియనియురుకోపము ననుచూడవో వాదికుసుధలాలుకు మాట- లాడవా నాతోడయాత్మేశనీవు - నిండేవురు నుగల్గినన్నిట్లువిధియు- భండనంబుననొంకబడుమనివ్రాసె - యేమందునాకింక నెవ్వరుదిక్కు-- యీమందిరంబేలయా భోగమేల- యీతల్లిదండ్రులు యీబంధుజనుబు-ఈతరుణీమణులీవైభవంబు- లేటికినాచెంతనీవులేకున్న - పాటింపనాపుణ్యఫలమిట్టులయ్యె-నాపాలిదైవంబునానోముపంట- నాపెన్నిధానంబనాపట్టుగొన్న- ఈశవేములపల్లెయీశునకుమరు - లేశంబువనమీదలేదాయెనయ్యో॥

దరువు - ఆదితాళము - మారువ.

ప్రాణనాథాఅయ్యోనాప్రాణనాథా । ప్రాణనాథనాగపాశబంధములబాణునిచేగతప్రాణుడవైతివె॥ ప్రా॥ పున్నమచెందురుకన్నచెన్నగుమోమువన్నెదొరగినేలవ్రాలెనేమందు॥ ప్రా॥ వేములపల్లెనివేశునకునుద్రోహమేమిజేసితిమొగామనకుకటా ॥ప్రా॥

అనిరుద్ధునివచనము॥ క॥ అయ్యయిట్లుణ విలపించెదు । వనజాపదళాయతాక్షివాక్యములెల్లణ । వినికన్నులునీరచియయ । వ్వనితంగనిపలెకుదీనవదనుండగుచుణ ॥ క॥ఓరమణీతరమియంతట।వాసికేణ పూర్వకర్మవారింపంగా । శ్రీరామలక్ష్మణులుమును। యారణమునపట్టుపడరేయహిపాశములణ॥ వ॥ కావున యింతపలికెనీస్వాంతంబున చింతచేయవలదువలదేయోయింతీయని యిట్లనిరుద్ధుండు ఉషాకన్యనూరార్చునెడవినిబాణుండు॥

బాణునివచనము॥ ఆహాహాచోపుదారీఅవరాటలాడువాడెవ్వడురా

చోపుదారివచనము - అనిరుద్ధుడుస్వామి.

బా॥ అనిరుద్ధుడునరలబ్రతికియున్నాడేమిరావోరీ॥చో॥బ్రతికియున్నాడుస్వామీ॥ బాణునివచనము ॥ అయితేవానిని శ్వేషంబుగావధియించుచున్నాను పదపదరావోరీ॥

గీ॥ అనుచువెసలేచిబాణుడత్యాగ్రహమున । పట్టసముకేలనంకించిభయదలీల। నరుగుదెంచియునిరుద్ధునట్టెగాంచి। యట్టహాసంబుసేయుచునిట్టులనియె॥ ఓరీయనిరుద్ధా॥ క॥ చిక్కితివెక్కడబోయెద।విక్కడనినుగాచుకొనగహితులుంగలరా।దిక్కులుచూచినవిడుతునె । గ్రక్కుననీశిరముద్రుంతుకరవాలమునణ॥ వ॥ యిదిగోచూడరావోరీ॥

ఉషాకన్యవచనము - దరువు - అట • వరారుపరాగము.

వలదుచంపవలదునాప్రాణేశు। వలదుచంపవలదుచంపవలదు। వలదునాప్రాణేశువధియింపనీకేమి। ఫలముగల్గునుగురుపదములానచంపవలదు॥ ౧॥

శ్రీయదుకులవారిశేఖరకిరణులు, లాయతమణినికరాంచితాభరణులు, లార్యపోషణులు శత్రారిభీషణులు, శౌర్యభూషణులతి చతురభాషణులు, నగు రామకృష్ణులు యతివైభవముల, పొగడొందు ద్వారకాపురీనాథులు నాడు, పూని నిజాస్నానమునకు బోదలచి, స్నానసంధ్యాదిక క్రియల్ గడపి, వరవస్త్రభూషణావళులు వేర్వేర, కరమర్థిధరియించి కదలికంచుకులు, బంగరుబెత్తముల్బట్టి ముందరను, సంగతితో డుతసండడిజడియ, రాజమార్గముబట్టి రాపుణ్యపతులు, లాజాక్షతలు జల్లలావణ్యమమర, హెచ్చు వేములపల్లె యీశులీరీతి, వచ్చిరిసభ జారవైరీమీరా॥

దరువు - ఆది - రేగుప్తి.

రామకృష్ణులువచ్చిరి-కొలువైకుబల-రామకృష్ణులువచ్చిరి॥ ౧ ॥ రామకృష్ణులు నెమ్మోములకస్తూరి-నామములును మెరయసోమారకులనబల॥ రా॥ నీటులుమీరగను-సొగసైనపల్లె-వాటులు జారగను - కోటిసూర్యులమించుటపాటకోజ్వలరత్నకోటీరాంశులుదిశలదీటుకొన-బలరామ ॥ ౨ ॥ మల్లెపువ్వులసోనలు పైపైనజల్లుజల్లునగురయిచానలు- అల్లనల్లనరత్నహారములగియాడ - అల్లశ్రీవేములపల్లెనేలినబల॥ రామ॥

వ॥ ఇట్లుసభామంటపంబుజొచ్చి ద్వారకుంగాంచియిట్లనిరి. ఆహాఓరీ ద్వారకా॥ ద్వారకునివచనము॥ బుద్ధిపరాక్, ఆపద్బాంధవులారా, అనాధరక్షకులారా, దీనదయాపరులారా, దివ్యమంగళవిగ్రహులారా, రామకృష్ణులారా, యేమి శెలవిచ్చుచున్నారు స్వాములారా॥

రామకృష్ణులవచనము. ఈకొలువుకూటంబునకు సమస్తపరివార జనంబులున్ను వచ్చియున్నారేమోయీ ద్వారకా॥

ద్వా॥ బుద్ధిఅందరువచ్చియున్నారయా స్వాములారా.

రామకృష్ణుని వ॥ మాసింహాసనంబు లెచ్చటయున్నవోయీ ద్వారకా.

ద్వా॥ ఇదిగో ఇకకూడనేయున్నవి కూర్చోండి స్వాములారా.

రామకృష్ణులువచనము॥ ఆలాగెనోయీ ద్వారకా.

దరువు - మధ్యమావతి - ఆదితాళము.

కొలువైరి రామకృష్ణులు- కొలువైరి - రామకృష్ణులభిరామోన్నతవర హేమపీఠములసోమారుకులవలె॥ కొలు॥ హితులుసుతులుపురోహితులాశ్రితులు-భూపతులుయతులుసమ్మతితోగొల్వగ॥ కొలు ॥ వందిజనులకైవారములకు ముదమందివారిష్టార్థములొసగుచు॥ కొలు॥ భామలిరుగడలచామరలిడగను - వేముల్లపల్లెనివేశులయీశులు॥ కొలు ॥

క॥ ఇట్లేలుపునబలకృష్ణులు। వచ్చిసభాసీనులయిన వార్తలెరిగియుకా।
అచ్చుగసరిగమపధనిసని। వచ్చెన్ నారదుడు శ్రీనివాసునికడకున్॥

నారదుండువచ్చుట - దరువు - ఆది - తోడి.

శ్రీనివాసాననమోనమో - నమో శ్రీనివాసాయనమో - శ్రీనివాసాయ యాశ్రితపోషణాయ- సామగానప్రియాయఘోరదానవసూదనాయ- తఝుణు ఝుణుఝుణు తా ఝుణుంఝుణు తాతా ఝుణుంఝుణుంత ఝుణుంఝు ణుంతఝుణుంతకత ధిగిణథోం॥ శ్రీ॥ పక్షివాహనాయఅక్షయసాయకాయ మోక్షప్రదాయ ఫాలే క్షణమిత్రాయ- తకిటకిణంకిణుంకిణు తాకిణుంకిణుంకిణు తాతాకిణుంకిణు తకిణుంతకి ణుంతకతధీగిణథోం॥ శ్రీ॥ సామజవరదాయసోమార్క-లోచనాయ వేములపల్లె నివాసాయశ్రీశాయత ధణధణధణ తాధణధణధణ తాతాధణధణతధణధణతద్ద ణతారాధిపురిపు తారాధిపహారితారాచలసుత తారా మలతరతారా శారద ధారాధరఘనసావాబ్జపయః పారానారతుషారావార తుషారా పాండు రోదారకీర్తివిస్తారసుందరాకారా- సుకుమారామణిహారా- రణశూరా-వేం కటసుబ్బకస్తురియల్లప్పను నీపల్లవపదము- అల్లనాదగుయుల్లమునసుసం-ధిల్ల జేసివిరి- మల్లెలుమొల్లలు- తెల్లనిజాజులు నల్లగల్వలునుఫుల్లాబ్జంబులు పూజజే తు శ్రీవల్లభ వేములపల్లె నివాసా శ్రీ॥

వ॥ యిట్లాకాశంబువలనదిగివచ్చునారదుంగాంచి బలభద్రుండు శ్రీకృ ష్ణునకిట్లనియె॥ ఆహావో శ్రీకృష్ణా॥

శ్రీకృష్ణునివచనము. ఏమనాన్న బలభద్రా.

బలభద్రుడు॥ ఈవచ్చునారదమహామునీంద్రునిం దోడ్తెచ్చి, యర్హాస నంబులోనుంచి యర్ఘ్యపాద్యాదివిధులంబూజించి, మనయనిరుద్ధుని వృత్తాం తంబడిగి తెలుసుకొనవయ్యాతమ్ముడా శ్రీకృష్ణా॥

శ్రీకృష్ణునివచనము॥ మంచిబుద్ధి ఓలన్నాబలభద్రా అనికృష్ణుండుదిగ్గన లేచి నారదునెదుర్కొని కరంబులు మోడ్చియిట్లనియె॥ గీ॥ వందనము బ్రహ్మపు త్రా। వందనముశరత్సరోదవరుచిగాత్రా। వందనముమానిమిత్రా। వంద నముసహిత కలుషవల్లిలవిత్రా॥ వ॥ మీకుపదివేలవందనంబులుస్వామి నార దమహామునీంద్రా.

నారదునివచనము॥ క॥ శ్రీరస్తునీకువిజయశ్రీరస్తుసస్తత్యైజితశుభ యశః। శ్రీరస్తునీకువిద్యా। శ్రీరస్తుముకుందశౌరిశ్రీకృష్ణహరీ॥ వ॥ సుఖీభవసుఖీ భవదీర్ఘాయుష్మంతుడవై వర్ధిల్లవోయీ శ్రీకృష్ణా॥

శ్రీకృష్ణునివచనము॥ మహాభాగ్యముస్వామీనారదమహామునీంద్రా యీ రత్నపీఠంబునగూర్చుండుము, ఈయర్ఘ్యపాద్యాది పూజలు గ్రహింపుము స్వామి॥ నారదునివచనము॥ ఆగాగేనోయీ శ్రీకృష్ణా॥క॥ క్షేమమేసభార్యలకును। క్షేమమేపుత్రులకును క్షేమమెనీకుక । క్షేమమెనీపౌత్రులకును। క్షేమమెభా

తృతకును క్షేమమె కృష్ణా॥ నీదగుపుత్రమిత్రకళత్రభృత్యామాత్య వర్గంబులందరున్ను క్షేమంకదా శ్రీకృష్ణా॥

శ్రీకృష్ణునివచనము॥ క॥ స్వామీయేమనిచెప్పుదు । నామనుగుమలుసుతులు నేనుచాభ్రాతృవరుల్ । క్షేమమునన్నవైనను । నామదికొకచింతబొడమె నారదమౌనీ॥ నారదునివచనము॥ భగవత్స్వరూపుండవైననీకు ఈచింత యెక్కడనుంచివచ్చెనో శ్రీకృష్ణా॥

శ్రీకృష్ణునివచనము॥ విన్నవించెదను స్వామీ, నారదునివచనము- అదియేలాగోయి కృష్ణా॥

శ్రీకృష్ణునివచనము॥ నాదగుపౌత్రుండైన యనిరుద్ధుడొక్కనాటిరాత్రి నిజాంగనాయుక్తుండై హంసతూలికాతల్పంబుననిదురింపుచుండి మరునాడరుణోదయంబునకు నాకస్మికంబుగా మాయంబయిపోయిన యతనింగానక॥

ఉ॥ చూచితిమన్నిదేశములు చూచితిమెల్లనృపాలపట్టణముల్ । చూచితిమాశ్రమావళులు చూచితిమద్రినదీనదావళుల్ । చూచితిమెందు గానకను స్రుక్కెడనయ్యనిరుద్ధువార్తయుం । దోచినదెల్పి నాదయిన దుఃఖముదీర్పగదయ్య నారదా॥ వ॥ కావునయ్యనిరుద్ధువృత్తాంతంబుజెప్పి నామనఃపంకజంబునంగలకళలకము తిర్చుము స్వామీ॥ నారదునివచనము॥ క॥ దీనులగావభక్తా । దీనుడవయి పుట్టినీవు తెలియనిమాటల్ । దీనావననన్నుపరా । దీనునిగతినడుగనేల దేవయనంతా॥ వ॥ యీభూమిభారంబునివారించుటకై యవతరించిన సాక్షాద్విష్ణుండవుగదా, నీకుం దెలియనియర్థంబుగలదా, అయిన నాకు పుణ్యంబు సంపాదింపంగోరియడుగుట మేలుకాదా, యదియట్లుండనిమ్ము యనిరుద్ధునివృత్తాంతంబు తెలియంజెప్పుచున్నాను- వినవోయి శ్రీకృష్ణా॥ శ్రీకృష్ణునివచనము। యేలాగయ్యాస్వామి॥

నారదునివచనము॥ గీ॥ వినుము చిత్రరేఖయనియెడియొకనాతి। మచ్చుజల్లి గగనమార్గమునను। మంత్రశక్తిచేత మనుమనిగొనిపోయె । దానిం బాప నెంచదరమె కృష్ణా॥ వ॥ ఇట్లుగొనిపోయి బాణాసురపుత్రికైన యుషాకన్యకొసంగియది తనగృహంబునకుంబోయిన ॥ క ॥ హృదయాంతమయము లెరుగక । మదవతియుకుమారవరుడు మదనోన్మాదం । పొదబొదల బెనగ సతికిన్ । కదురుకొనెకొన్నాళ్ళకును గర్భంబున్॥ వ॥ ఇట్లుషాకన్యగర్భంబుదాల్చియున్న నెరింగిబాణుండు సంగరంబున యనిరుద్ధుంబట్టి నాగపాశబద్ధునింజేసి కారాగృహనిబద్ధునింగావించి యున్నాడోయి శ్రీకృష్ణ॥ శ్రీకృష్ణునివచనము॥ అని నారదుండు చెప్పినవిని శ్రీకృష్ణుండు బలభద్రుంగాంచి యిట్లనియె॥

దరువు - అసావేరి - అటతాళము.

వింటివేమయ్యా అనిరుద్ధునివిధమెల్ల తెలియా - వింటివే అనిరుద్ధుడంటా

బాహాసు ఖణింటజేరి। దరనుండవా బలభద్రా॥ విం॥ ఆకారాగృహములోపల జిక్కి-యతడహర్నిశము । ఆకలిదప్పిశేనసురుసురనుచునుచీకాకుబడియెంతశోకమునొందెనో॥ విం॥ అల్లవేములపల్లె శ్రీహరినమ్మిచాలా। తల్లిదండ్రులవలచితనసోదరులదలచి। యుల్లములోనెంతయుడుకుచున్నాడో॥ విం॥

ఉ॥ చిత్రజుబోలువానిసుధికించెడుమాటలనీటువానిమేల్ । మెత్తనిమేనువానిరుచి యుంచినవవ్వలమోముచానినిన్। చిత్తమునందలంచిననుశీఘ్రితనాదగుమానసంబుహా। తత్తరమందిచెన్వగలదాకోనుచున్నది యోమునీశ్వరా॥

వ॥ అట్టిసుకుమారుండయిన యనిరుద్ధకుమారుండు కారాగృహంబునసుండుటవినిన యంతనుండియుచదరుచున్న నామనంబుకుదురుకొల్పుటకు యుపాయంబెరిగింపుము స్వామినారదమహామునీంద్రా॥ నారదునివచనము॥

నీవుసర్వజ్ఞుండవయ్యును ప్రాకృతునివలెందంబున డెందంబున తొందరబొందనేలనికఠంబుగానీవు చక్రంబుధరియించితివేని ఈరేడులోకంబులు వడవడవడంకవా, యింకయాలస్యంబేమిటికిబలభద్రసహితుండవయిపోయి బాణునిజయించి యనిరుద్ధునిందెచ్చుటకు యత్నంబుగావింపుమోయి శ్రీకృష్ణ॥

మంచిదిబుద్ధిస్వామి॥ నారదునివచనము॥ యేనింకపోయివచ్చుచున్నానసుజ్ఞయొసంగుమోయి శ్రీకృష్ణ॥

శ్రీకృష్ణునివచనము-మంచిదిస్వామీ॥

నారదుండపోవుట - తరంగము.

తకుర్తాంతరితాకురుంతరి- ఆదియుగమునమత్స్యమైక - వ్యాధుడగు సోమకునిద్రుంచియు - వేదములుపద్మజునకొసగినదయాకరా॥ తకుర్తాంతరితాకురుంతరి - పేర్మితోడసురాసురులుమొరపెట్టక్షీరాంబుధిలోనడుమనకూర్మరూపమువాల్చిమందరకుధరమెత్తినమాధవా॥ తకుర్తాంతరితాకురుంతరి-అట్టిభూమియుచాపచుట్టగ-చుట్టిచంకనబెట్టుకొనుదితిపట్టియగుహేమాక్షుకోరగొట్టివేసినసూకర॥త॥ దంభముసయాహేమకశిపుడు డింభకునిబాధింపవేగమె- స్తంభమునజనియించియతనివిజృంభమణచిననరహరీ॥ త॥ తామసంబునవరుణపాశస్తోమములబంధించిబలినిన్ - ప్రేమతత్పదమింద్రుకొసంగినవామనాభక్తావనా।త। క్షాత్రమునముయ్యేడుమారులు - క్షత్రియులఖండించిదానము - పాత్రమనియాకశ్యపునకునుధాత్రియొసగినభార్గవా॥త॥ కంధిబంధనజేసియాదశ- కంధరునిహరియించిమించినసుంత రాత్మజనేలుకొనఁ- వసుంధరాపతిరాఘవా॥ త॥ దేవతలుప్రా- ర్థింపధరణీదేవిభారమునుమాన్పగనువసుదేవునకుజన్మించితౌబల-దేవదేవదయానిధే॥ త॥ కలితదివ్యప్రతాపబౌద్ధ- కలితరూకబోధిపుశిరములను-వెలయువేములపల్లె-శ్రీవెంకటేశదయానిధే॥ త॥

క॥ ఈరీతిహరిని నెన్నుచు। నారదుఁడే తెంచెశోణనగరముఁజేరన్। ద్వారవతిగల్గువార్తలు। ఘోరునబాణాసురునకుబోధించుటకై॥ వ॥ ఇట్లాకాశంబున నుండి భూతలంబునకుడిగ్గి సభామంటపంబు జేరవచ్చునారదుంగనిబాణాసురుండుదిగ్గునలేచి తనవేయుకరంబులుముకుళించియిట్లనియె॥

బాణునివచనము గీ॥ వందనంబునీకువారిజాసనపుత్ర। వందనంబుశుభ్రవదనగాత్ర।వందనంబునీకువరయోగిసన్మిత్ర।వందనంబునుజనవనజమిత్రా॥

వ॥ నీకుపదివేలవందనంబులుస్వామీ నారదమహామునీంద్రా॥

నారదునివ॥ దీర్ఘాయుష్మంతుండవైవర్థిల్లవోయీ బాణాసురా॥

బాణాసురునివచనము॥ ఈరత్నపీఠంబుపైగూర్చుండుడిస్వామీ॥

నారదునివచనము॥ ఆలాగేనోయీబాణాసురా।

బాణునివచనము॥ఈయర్ఘ్యపాద్యాదిపూజలుగ్రహించండిస్వామీ॥

నారదునివచనము॥ అలాగేనోయిబాణాసురా॥

బాణునివచనము॥ మీరుయెచ్చటనుండివచ్చితిరయ్యాస్వామీ॥

నారదునివ॥ ద్వారకాపట్టణమునుంచి వచ్చితినోయీ బాణాసురా॥

బాణునివచనము॥ యేమికార్యార్థమైవచ్చితిరి స్వామీ॥

నారదునివచనము॥ యాకృష్ణుండు ద్వాదశాక్షౌహిణీబలయుతుండైనీపురంబుముట్టడివేయుటకు ప్రయాణంబైవచ్చుచున్నవాడుగావున యతనితోయుద్ధంబుగావించుచున్నావోలేక యనిరుద్ధునివిడిచి సంధిగావించుచున్నావని నీమనోభావంబు దెలియుటకై ఇందువచ్చితినోయీబాణాసురా॥

బాణునివచనము॥క॥ పుట్టితిబలిదైత్యునకున్। పట్టితిగౌరీశుపాదపద్మయుగంబున్। గొట్టితిదిక్పాలురచెర।బెట్టితిరాజులనుయేనభేద్యబలముఁన్॥

వ॥ ఇట్టిజగజ్జెట్టియగునాకుగట్టువిల్కాడుపట్టువుదెరుంగక యగ్గట్టుదాల్పుగట్టడిమూకలంగట్టుకొని నాపట్టణంబుపయిన్ దండెత్తివచ్చుచున్నవాడామేలుమేలట్టివానిచుట్టరికంబుగట్టిబెట్టి యతనితో సిద్ధంబుగ యుద్ధంబుగావించుచున్నానుగాని యనిరుద్ధునివిడువనయ్యాస్వామీ నారదమహామునీంద్రా॥

నారదునివచనము॥ నామనంబునకుసంతోషంబయ్యె నింకపోయివచ్చుచున్నానయ్యాబాణాసురా॥

బాణునివచనము॥ మంచిబుద్ధిస్వామీ॥ క॥ ఇటువలెనారదుడరిగిన।పటుతరకోపాగ్నిఘూర్ణమభయదోగ్రభ్రూ। కుటిఘటితాననుడయి నిజ। భటవర్గము చూచిపలికెబాణాసురుడున్॥వ॥ఆహాఓదానవోత్తములారా॥

భటులు, ఓహోయేమయ్యాబాణాసురేంద్రా॥

బాణునివచనము॥ గీ॥ రామకృష్ణులుయదుబలోద్ధాములగుచు। యరుగు

దెంచుదురట నేడుయతిరయమున । కోటవాకిళ్ళబురుజులకొత్తళముల । ప్రబలులయినట్టిశూరులభద్రపరచి॥ వ॥ మీరుకరితురగరథంబులాయంబుచేసుకొని సమరసన్నద్ధులై హెచ్చరికగల్గియుండరోయి॥

భటులు॥మంచిబుద్ధిస్వామీ॥అనిసమరసన్నాహంబుననుందునంతా॥

కృష్ణునివచనము॥క॥ అచ్చటద్వారకలోపల । అచ్చుగనారదుడుజనిన యంతయుగోపం బచ్చుపడనత్తైబలికెను । క్రచ్చరబలరాముబూచికంసాంతకుడున్॥ ఆహాఓయిఅన్నాబలభద్రా॥ బలభద్రునివచనము॥ యేమయ్యాతమ్ముడా శ్రీకృష్ణా॥

శ్రీకృష్ణునివచనము॥ మనయనిరుద్ధునివృత్తాంతంబుతెలిసెనయ్యాబలభద్రా॥

బలభద్రుడు॥ తెలిసెనయ్యాశ్రీకృష్ణా॥

శ్రీకృష్ణునివచనము॥ క॥ దండింతున్ త్రిపురాంతకు । దండింతున్ బాణు వేయుకరములుకీర్తుల్। నిండింతుదిశలపాత్రన్ । ఖండితముగ జేత్తుబాలికామణి తోడన్॥ వ॥ ఇంకయాలస్యంబుదక్క-సాంబసారణసాత్యకిప్రద్యుమ్నాదికుమారవర్గంబులోకరితురగరథభటయుతంబుగాద్వాదశాక్షౌహిణీబలంబు ముందు వెడలించినీవును సమరసన్నద్ధుండవైరావన్నాబలభద్రా॥

బలభద్రునివచనము॥ ఆలాగేనయ్యాతమ్ముడాశ్రీకృష్ణా॥

కృష్ణునివచనము॥ ఆహాఓయిద్వారకా॥

ద్వారకునివచనము॥ బుద్ధిపరాకుయేమయ్యా శ్రీకృష్ణా॥

శ్రీకృష్ణునివచనము॥ సకలసాధనయుతంబుగా మనరథంబాయత్తంబుజేసుకొనిరారాఓరీద్వారకా॥

ద్వారకునివచనము॥ ఆలాగేతెచ్చియున్నానయ్యాస్వామీ॥

శ్రీకృష్ణునివచనము॥ ఇదిగోరథంబెక్కి-తినిశోణపురమార్గంబున నడిపింపఓయిద్వారకా॥ ద్వారకునివచనము॥ మంచిబుద్ధిస్వామీ ॥

క॥ అనిబలమెతుడనుద్వారకు । డనువందగచిత్రగతుల యరదమునడుపన్। గనిహరిమెచ్చుచుయిచ్చలి । తనయునిపురిచేరిపల్కె-తాలాంకునితోన్।

శ్రీకృష్ణునివచనము॥ ఆహాబలభద్రా॥

బలభద్రునివచనము. యేమయ్యాతమ్ముడా శ్రీకృష్ణా॥

శ్రీకృష్ణునివచనము॥ బాణుంజేటశోణపురసమీపంబునకువచ్చితిమి మనసైన్యంబులబురికొల్పి యిప్పట్టణంబుముట్టడిగావింతామాఅన్నాబలభద్రా॥

బలభద్రునివచనము॥ ఆలాగేపదవయ్యాతమ్ముడాశ్రీకృష్ణా!।

శ్రీకృష్ణునిదరువు - తోడి - ఆదితాళము.

పట్టుపట్టుపట్టుపట్టుడిఇప్పురముల్గ - పట్టుపట్టుపట్టుడి॥ పట్టుపట్టుడి

ఇప్పట్టణముగ్రోవలరి- కట్టుకట్టుడిచుట్టుముట్టడి వేసియున్నలగ్గ॥ ప॥ ౧॥ గోటలు బురుజులు పెద్దకొత్తలములనూకవేసి - పేటలూటిజేసిలేదోటలుఖండించిలగ్గ॥ ప॥ ౨॥ పాటించిశ్రీవేములపల్లెహరిదలచిఈక - వాటములువిరుగదంతి కోటలూడిలగ్గ॥ప॥౩॥

క॥ ఈరీతి సేయుయదుసైన్యారావంబెరింగిబాణుడాస్థానంబున్ ౹ జారజనిపత్కేనిజపరి౹ వారంబునతోగభీరవాగ్జృంభణుడై॥ వ॥ అహాహోఓదానవోత్తములారా బలరామకృష్ణులు ద్వాదశాక్షౌహిణీబలసమన్వితులై వచ్చి మనపురంబుముట్టడిగావించి కోటలగ్గలబట్టించుచున్నారట వారిపైసన్నద్ధుండనయియుద్ధంబునకువెడలుచున్నాను మీరునుసమస్తసైన్యయుతంబుగా సమరసన్నాహంబుగావింపరోయి॥

భటులవచనము॥ ఆలాగేనయ్యాబాణాసురేంద్రా॥ వ॥ అనియిట్లుబాణుండుసమరసన్నాహంబుగావింప తద్వార్తలెల్ల చారులచేవినిబాణాసురుని భార్యయగురత్నవల్లి తనపతియైనబాణాసురునికడకువచ్చెను.

ద్విపద- అంతబాణునిరాణియంబుజపాణి - సంతతశుకవాణిసయికతశ్రోణి - కమలసన్నిభనేత్రికాంచనగాత్రి- భ్రమరకుంతలజాలభర్తానుకూల- యననొప్పుచున్నట్టియారత్నవల్లి- తనపతియగుబాణదైత్యకులేంద్రు - డనువందకృష్ణుతోనని సేయగోరి- చనుదెంచితనసభాస్థలినుండుటయును- చారులచేవిని పలజారియతని - చేరగాజనిబుద్ధిజెప్పంగదలచి - దైత్యభామినులుకొందరుముందునడువ- ముత్యాలగొడుగులుముగుదలుపట్ట- కమనీయ్యారత్నసంఘటితవిచిత్ర విమలసద్భూషణవితతులుమెరయ - కుచములహారములొగుమిసియాడంగ - రచనతోవింజామరలుసతులులిడగ- కురుచయాపమ్మెదకొంగుదూగాడ - మెరుపైగనయాశరన్మధ్యమేఘమున - సరవిచరించెడుశశిరేఖయనగ - సరిగంచువెలిపట్టు శాల్సెల్లునుంగు- నిడిప్రాణవిభుజాడనెలమినంగనల - నడుగుచుజనుదెంచియువనిపైశిరుల- విలసిల్లుచున్నట్టివేములపల్లె - నిలయునెమ్మనమునునిల్పియిట్లనియె॥

దరువు - ఆది - భైరవి.

ఇంకేమిసేతునోఓయమ్మ - ఇంకేమిసేతునేయిందీవరాక్షుడు - కొంకకమనపురముకొల్లబెట్టెనట॥యిం॥ రట్టడిమూకలగట్టుకకృష్ణుడు - చుట్టుముట్టిలగ్గబట్టించుచున్నాడట॥యిం॥ ధరణిలోవేములపల్లెధాముడౌశౌరితో దురములోనెదురింపదరమెనావిభునకు॥యిం॥

క॥ చూపరెనాప్రాణేశుని- చూపరెనామోహనాంగు చూపరెవిభునిన్-చూపరెనామనోహరు - చూపరెబాణాసురేంద్రుసుందరులారా॥

దరువు - శుద్ధకాంభోధి - ఆదితాళము.

చూపరేనా ప్రాణనాధు॥ చూప॥ చూపరమ్మలారా మీరుకోపముశా యక-నాపైనాపతియో బాణదైత్యనాధుజేరిచేడెలార। చూ॥ క్రుద్ధతానాగపాశబద్ధుడైనట్టియని-రుద్ధువిడువుమనిపంచిబుద్ధిజెప్పేనునమ్మలారా॥చూప॥ యిల నుశ్రీవేములపల్లెయీశునితోవైరమింక - వలదువలదువలదటంచు పలుమరుబోధింతునిపుడు॥

వ॥ ఓకొమ్మలారా నాప్రాణనాధుడైన బాణాసురేంద్రుండెచ్చటనున్నాడో చూపరమ్మా॥ చెలులవ॥ ఇదిగో యిచ్చటనేయున్నాడు చూడవమ్మా॥

రత్నవల్లివచనము॥క॥ అనియిట్లు చెలులుజెప్పగ । వినితనప్రాణేశుజేరి వినయంబొప్పగ ।యనెనపుడురత్నవల్లియు । మునుకొనితనకరయుగంబుమొగిచినరేంద్రా॥క॥ వందనముసురకులేశా। వందనమాశ్రితగిరీశవైరివినాశా। వందనముజితసురేశా। వందనమిదెదైత్యవంశవార్ధినిజేశా॥

వ॥ మీకుపదివేలవందనంబులుస్వామీ బాణాసురేంద్రా॥

బాణునివచనము॥ క॥ నీదగువాల్గన్నులకును । నీదగుకుచకుంభములకునీకీల్జడకున్ ।నీరదహాసముకాశీ।ర్వాదముగావింతునిదిగో వారిజనేత్రీ॥

క॥ యెన్నడునుబాదుకొల్వన । కెన్నికననుజేరవిపుడుయేతెంచుపనే। మున్నదో నాకుందెల్పుము।పన్నగరాట్సదృశవేణిపరభృతవాణీ॥ వ॥ నీవకొల్వుకూటంబునకువచ్చినపనియేమోచెప్పవే ఓరత్నవల్లీ॥

రత్నవల్లివచనము॥ ఆలాగేవిన్నవించెదనుస్వామీవినుము॥

గీ॥ దేవయవధరింపుదేవకీదేవకీ।విష్ణుడుదయమయ్యెకృష్ణుడనగ । వలవదతనితోడవైరంబుగొనిగెల్వ।వశముగాదెత్రిపురవైరికైన। వ॥ యతండుభూభారంబువారించుటకైయవతరించిన సాక్షాద్విష్ణుండుగానెరుంగుముస్వామీ ॥

బాణాసురునివచనము॥ గీ॥ కన్నవారివిడిచికంసభీతినిమంద । జేరియచటజారచోరవృత్తి। యెలమిగొల్లవారియెంగిల్లుగుడుచుచు- వెలదితిరుగువాడువిష్ణుడటవే॥ వ॥ యతనివిష్ణుండనినమ్మజాలనేఓకొమ్మా॥

రత్నవల్లివచనము॥ విష్ణుండగుటకుయతండొనర్చిన యమానుషంబులగుకార్యంబులెసాక్షిస్వామీ, బాణునివచనము, యమానుషంబులగుకార్యంబులనగానెట్టివేఓరత్నవల్లి, రత్నవల్లి-బాణాసురులసంవాదము.

సీ, బాలుడైపూతనబరిమార్చుటెరుగవా - అపుడానినిజంపుటదియునెంత-ధట్టించిశకటునిదన్నుటెరుంగవా బండనిదన్నుటబంటుతనమె - బలియుతృణావర్తుబడవైచుటెరుగవా- సుడిగాలినోడియుటసూరతగునె- కూలపించిమద్దులగూల్చుటెరుంగవా - మాకులగూల్చుటమహిమయగునె - గోవులనుగాచుచుండిబృందావనమున బకునిద్రుంచుటయెరుగవేప్రాణనాధ - కొంగనువధించు

టదియెంతగొప్పవాని।శౌర్యమెన్నకునాచెంతచంద్రవదనా॥ క॥ ఖరుఁడనుదైత్య కులేంద్రుని। బరిమార్చినయట్టిబాహుబలముకవినవా। ఖరుడనగాడిగవానిక। బరిమార్చుటబంటుతనమెపద్మదళాక్షి॥ క॥ ధాత్రిక గోవర్ధనమను। ధాత్రీధర మెత్తినట్టిధైర్యమువినవా।ధాత్రీధరమనడల్మీక। మాత్రంబదియెత్తుటెంతమదగ జగమనా॥వ॥యతండుసామాన్యుండనితలంచియున్నానేవోరత్నవల్లి॥

రత్నవల్లివచనము.

ద్విపద॥ వినుమంతుప్రాణేశవిశదంబుగాను - వినుమునారదుచేతవింటి నేతొల్లి - కాలుండుసత్రయాగముసేయుచుండివాలాయమునుప్రాణివధజేయ కున్న-యంతంబునొందకయసురులైజనులు - యంతకంతకువృద్ధియైనభూదేవి- భారమోర్వగలేకభరమునబోయి - నారాయణునిపాదనళినములెంచి- వినుతిసే యగమనవిష్ణు సేవుండు - యనువొందభూమికినభయంబొసంగి-వసుదేవదేవకి వరగర్భమునను- వసుధపైజన్మించివారకనతడు- గావించినట్టియాఘనశౌర్యమె ల్ల-దేవమీబుద్ధికితెలియునేతెలుసును-యిదిగాకచెప్పెదనింకొకవార్త-పదపడివి నుముసోప్రాణేశతొల్లి-తడయకమత్స్యావతారంబుదాల్చి- బదపడిసోమకుబ ట్టివధించె - కూర్మమైమందానకుధరంబుమోసె - పేర్మితోఘోణియైభీకరదం ష్ట్రి - ధారచేవిదళించెతగహిరణ్యాక్షు - ఘోరమానవమృగాకృతియైవహిం చి-హేమకశ్యపుద్రుంచియేలెప్రహ్లాదు-వామనుడైపుట్టివంచించిబలిని-భూమి యెల్లనుగొనిపురుహూతుకొసగె- రాముడైజనియించిరాజులద్రుంచె - రాము డైరణమునరాజులగూల్చె - రామకృష్ణాకృతిరహిగాంచెనిపుడు - యతడాదివి ష్ణుండుయతడవ్యయుండు - యతడునిరావయుండప్రమేయుండు-యతడువేము లపల్లెహరియైనవాడు-యతనిగెల్వగనీకుసగునెప్రాణేశా॥

దరువు - ఆది - మారువ.

వలదువలదుప్రాణనాథా- వైరముశ్రీకృష్ణుతోను - యిలనుగావబుట్టిన ట్టియీశుడుశ్రీశుడాతడు॥ వ॥వామనుడైబలియజ్ఞవాటమునకరిగియతని - తామ సమునబంధించినతామరసాక్షుడాతడు॥వ॥ధరణిశ్రీవేములపల్లెధాముడైన- శ్రీ కృష్ణునిశరణుజొచ్చిబ్రతుకుమునీశరణములకుమ్రొక్కెదనిపుడు॥ వ॥ యమ్మహాను భావుండైశ్రీకృష్ణునిశరణుజొచ్చిప్రాణంబులుగాచుకొనుముప్రాణనాయకా॥

బాణునివచనము॥క॥ భూతలముబ్రోవబుట్టిన। భూతమయుండస్మదీ యభుజనాశముకై। యేతెంచెశరణుజొచ్చిన। యాతండెటునన్నుబ్రోచునం భోజముఖీ॥ వ॥ యతండుదైత్యాంతకుండనసమాఖ్యవహించి దైత్యుండనైన నన్నెట్లురక్షించునేవోరత్నవల్లి॥

రత్నవల్లివచనము॥ క॥ పగవానితనయుడనుచును। పగయించకలేక

బ్రోచె ప్రహ్లాదుకృపన్। పగవిడచి శరణుజొచ్చిన। తగగవిభీషణునకభయదానంబీడే। వ. అట్టి ప్రహ్లాదవిభీషణులు దైతేయులు గాదా వారలరక్షించియుండలేదా సర్వసముడయినయతనికి పగచెలుములు గలవా వో ప్రాణనాథా॥

బాణునివచనము॥ క. పురహరుని పాదపద్మము। లరిమురిభజియించునేనుయలదీనుడనై। మురహరుని కెట్లు మ్రొక్కెదు। తరుణీ నాశిరమువంచి దాయలుగనన్॥ క॥ మాధవుని గెల్తు లేదా। మాధవుని చేబొలిసి మోక్షమార్గముకందున్। గాథలు నాతో పెక్కులు। బోధింపకుమిట్టితుచ్ఛబుద్ధులు తరుణీ॥ వ॥ యీయగాధంబులైనబోధంబులు నాచెవిజొరవు చాలుచాలు యింక నీమందిరంబునకుం బోవేవో కుందరదనా॥ గీ. అనిపరత్నవల్లియతిభీతిచిత్తయై। పతికియడ్డమాటబలుకవెరచి। చనియె వేగ తనదుసదనంబు జేరగ। బాణదైత్యుడనికి బయనమయ్యె॥

యీశ్వరుడు యుద్ధానకు వచ్చుట.

ఉ. కోటిశశాంకులొక్కయెడకూడినయట్లను ప్రభల్ దిశల్। దీటుకొనంగ నిల్జ నదీచలితోర్మివిఘట్టనంజటా। జూటమునందు నిల్వక కిశోరనిశాకరుడాననంబుపై। మాటికి జేరవచ్చెను నువరాపతిబాణుని గొల్వ జేరగన్॥

దరువు - తోడి - ఆదితాళము.

వచ్చెను సదాశివుడు- బాణునికడకువచ్చెను సదాశివుడు - వచ్చెను సదాశివుడచ్చుగణన వెంటవచ్చు ప్రమధులతోడా-నుచ్చటలాడుచు॥ వ॥ జడలలోమిన్నేరు సగము మేనుగారు మెడనవున్నల పేరు మెరయ బాణునికడకు॥ వ॥ కరిచర్మచేలముకన్నున్నఫాలముకరమున శూలము- గల్గి బాణునికడకు॥ వ॥ ధాత్రివేములపల్లెధాముడైన శౌరి-మిత్రుడు యబ్బలిపుత్రునిసభ జేర॥ వ॥

వ. యిట్లువచ్చిన శివుంగాంచి గద్దియడిగ్గి కరంబులు మోడ్చి బాణుండిట్లనియె॥

బాణునివచనము॥ గీ॥ శరణుశరణు సూర్యశశివాయుసమనేత్ర। శరణుశరణుగోత్రడాకళత్ర। శరణుశరణు నీకు శరదభ్రిమగాత్ర। శరణుశరణు ధనదసఖిపవిత్రా। నేసేయు వందనంబులు గైకొనుము స్వామీ॥

శివు-ఆలాగేనోయి బాణాసురా.

బాణు యీరత్నపీఠంబున గూర్చుండుము స్వామీ.

శివు-ఆలాకేనోయి బాణాసురా.

బాణు యీ అర్ఘ్యపాద్యాదులు గైకొమ్ము స్వామీ॥

శివు-ఆలాగేనోయి బాణాసురా॥

బాణు మీరిచ్చటికి విజయంచేసిన పనియేమయ్యా స్వామీ॥

శివు- నీవు శ్రీకృష్ణునిపై యుద్ధంబు సేయబోవుచున్నావని తెలిసి నీకు సహాయుంబు నటకువచ్చితినోయీ బాణాసురా. బాణు-మంచిది బుద్ధి స్వామీ॥

శివు, యిదిగో కుమారాది ప్రమథగణంబులతో యుద్ధంబునకు వెడలుచున్నానోయి బాణాసురా॥

బాణు- ఇదిగో నేనునుయసురగణయుతుండనై మీవెంటవచ్చుచున్నానుపదపదండిస్వామీ॥ శివు-ఆలాగేనోయిబాణాసురా॥

దరువు - మధ్యమావతి - ఆదితాళము.

నందివాహనుడై వెడలెహరుడు - యుద్ధమునకునునందివాహనుడై వెడలెహరుడు॥నం॥ నందినెక్కి-యానందముతో బాలేందుధరుడు గోవిందునిమీదను నంది॥నం॥ జడలలోగంగబొంగుచుండా ధావళ్యమైనయొడలభస్మము మెరయుచుండా-బడిబడితనవెంబడిప్రమథులుకదువడినడువగచిడముడిపాటున ॥ నం॥ వాలాయమసురేంద్రుబ్రోచుటకు వేములవాసుడౌ శౌరితోబోరుటకు కేలను భయదాభీలంబగునిడశూలము త్రిప్పుచునీలకంధరుడు॥నంది॥

వ॥ యిట్లువచ్చిరణాంగణంబుజొచ్చివృషభంబును శ్రీకృష్ణునియరదంబునకెదురుగాబరవుచు శివుండిట్లనియె॥ ఆహావోయి శ్రీకృష్ణా॥ మేమోయి యీశ్వరా॥ శ్రీకృష్ణునివచనము॥

శివునివచనము॥ సీ॥ చోరవైవారిలోజొచ్చిడాగినవాడైన కూర్మమైగిరిక్రిందకుదుగుకొనిన । పందివైమేదినిక్రిందికెదూరినకంఠీరవాకృతిగానబడిన । గుజ్జురూపంబుచేకొనిభిక్షమెత్తితిభూసురాకృతితోడభువిదిరిగిన । కోతులసంగడికూడివర్తించినదుక్కి-మోమైయూరుమున్నుకొనిన । పొలతులవ్రతంబుజెరుపంగబోయికలికి తనముజూపినవిడుతు నేతారణేతు । ప్రళయకాలాగ్నితులితమద్బాణపాశబద్ధుగావింతు బాణునిపగయతండు॥

వ॥ రారావోరీ శ్రీకృష్ణా॥ శ్రీకృష్ణునివచనము॥

సీ॥ రహిమాన్వరక్షాధ్వరప్రయోగము కాదుఘనమదస్త్రప్రయోగంబుగాని।అర్పతదీయహోమాగ్నికీలలుగాదు అస్మదీయోగ్రబాణాగ్నిగాని। హరిఇంపతత్సుక్సువాజ్యధారయుగాదునళిశాత్రవశక్రధారగాని । వట్టుపెట్టగతదామ్నాయఘోషముగాదుమదార్జితవద్గుణఘోషగాని । వీరభద్రాకృతియుగాదువిజయమంద - భయదశ్రీబలభద్రాకృతియగాని - మారుడనుగానునీకంటిమంటగాగ - రుద్రవినుదేవకీకుమారుండగాని॥

వ॥ ఇట్టినామురదర నీసాహసంబుసాగదోయీ ఈశ్వరా॥

శివునివచనము॥ ఐతేబ్రహ్మాస్త్రంబును, వాయువ్యాస్త్రంబును, ఆగ్నేయాస్త్రంబును, పాశుపతాస్త్రంబును క్రమంబునసీపైబ్రయోగింపుచున్నాను చూడవోయి శ్రీకృష్ణా॥

శ్రీకృష్ణునివచనము॥ నీయాస్త్రంబులకు ప్రత్యస్త్రంబులు వచ్చుచున్నవి

చూడవోయి ఈశ్వరా॥ తాంతరఘుణ అనియుద్ధము చేయుట॥

శ్రీకృష్ణునివచనము.

ఆహావోయి ఈశ్వరా, బ్రహ్మాస్త్రంబు చేతనున్ను వాయవ్యాస్త్రంబు పర్వతాస్త్రంబు చేతనున్ను, ఆగ్నేయాస్త్రంబు వారుణాస్త్రంబు చేతనున్ను, పాశుపతాస్త్రంబు నారాయణాస్త్రంబు చేతనున్ను, క్రమంబునం ద్రుంచితి నింక సమ్మోహనాస్త్రంబు ప్రయోగింపుచున్నాను చూడువోయి యీశ్వరా॥

అదియేలాగోయి కృష్ణా। తాంతతరఘుణ అనియుద్ధము చేయుట॥

క॥ ఇకరణికృష్ణుడేసిన । నికరంపు సమ్మోహమునను నిటలాక్షుండుతా। నుక్కుచెడి మూర్ఛనొందియు। గ్రక్కున వృషభేంద్రు మహాపురము పైవ్రాలెన్॥

గీ॥ హరుడు సొలుటయును యాతని సైన్యముల్ । విచ్చె యదుబలములు వెంటనంట।నదియును నెరిగి చారులప్పు బాణుకడకేగి । పలికిర పుడుతొట్రుపాటుతోడ॥

చారులవచనము॥ బుద్ధిపరాకువో బాణాసురేంద్రా, మనయీశ్వరుండు శ్రీకృష్ణుని సమ్మోహనాస్త్రంబుచే మూర్ఛిల్లెనయ్యా స్వామీ బాణాసురేంద్రా॥

బాణునివచనము॥ యింకా యేలాగు రాఓరీ॥

చారులవచనము॥ కుమారస్వామి ప్రద్యుమ్నుచే నోడిపోయెనుస్వామీ॥

బాణునివచనము॥ యింకా యేలాగు రాఓరీ॥

చారులవచనం॥ యదుగణంబుచే ప్రమథగణంబులు పారిరయ్యా స్వామీ॥

బాణునివచనము॥ వోహో కూపకర్ణా, వోహో కుంభాండా, శ్రీకృష్ణునిమీద యుద్ధంబునకిదిగో వెడలుచున్నాను, మీరును ద్వాదశాక్షౌహిణీబలసమేతులై వెడలుండోయి॥ వారలు, మంచిబుద్ధేను స్వామీ॥

బాణునివచనము॥ ఆహావోయి సారధీ సకలసాధనయుతంబుగా రధంబాయత్తంబు చేసుకొనిరావోరీ॥

సారధి బుద్ధి ఆలాగే తెచ్చియున్నాను స్వామీ ఈ రధంబెక్కి వెడలండి స్వామి॥

బాణునివచనము ఆలాగే యెక్కియున్నానోయి సారథీ॥

క॥ అరధమెక్కియు బాణుడు। ఘనభేరీ రధతురంగ కరిభటరవముల్। ఎనువీధి దిశలు నిండన్। జనుచును నిజభటులకనియె సరభసవృత్తిన్॥

దరువు - తోడి.

రండురండోయి - రండురండు యదురాజసైన్యముల భండనమునకడి ఖండలు చేతును॥ రం॥ కరులహరులభీకరులదొరలను పరిపరివిధముల పరియలు జేతును॥ రం॥ వెకసముగ శ్రీవేములపల్లె హరిచిక్కుపడచియును గ్రక్కున వత్తును॥ రండు॥

వోహో కూపకర్ణా వోహో కుంభాండా యీవచ్చు యదబలం

బులమదంబణంచండోయీ॥ వ॥ మంచిబుద్ధిస్వామీ అనికూపకర్ణకుంభాండులు యనుసైన్యంబులపైగవయునెడ బలభద్రుండు॥

బలభద్రునివచనము.

క॥ ఓరోరీదైత్యులారా। బోరునయదుసైన్యములను బొదివెదరహహా। రారండుక్షణములోపల। నీరాయుధనిహతిమిమ్ము శిరములద్రుంతుక్॥

రా రాండోయీదానవులారా- తొంతబురుఘణ అనియుద్ధముచేయుట అట్టిసంగరంబున బలభద్రునిచేకూపకర్ణకుంభాండులు గూలినంగనుంగొనిబాణుండు॥

బాణునివచనము. క॥ యేడీకృష్ణుండనువా। డేడీత్రిపురాసురారినేపడచినవా। డేడీవానియురస్థలి। గాండించెదకనకలిప్తఘునకాండములక్॥

వ. ఆశ్రీకృష్ణుండనువాడేడిరా వోరీ.

శ్రీకృష్ణునివచనము॥ చ॥ నిలునిలువోయిబాణరజనీచరశేఖర నేనెకృష్ణుడక్। నలవిరొనీకునంగెలువయర్కశతోగ్రసుదర్శనాహతిక్। కులిశముద్రేటునంవిరిగకూలుకులాచలశృంగమట్లనీ। తలయిలగూల్చిభాలు త్వరితంబునబంధపముక్తుజేసెదక్॥ వ. నిలువునిలువువోయిబాణాసురా.

బాణునివచనము. ఆహాశ్రీకృష్ణా.

శ్రీకృష్ణునివచనము. యేమోయిబాణాసురా.

బా- సీ। ఆక్రమింపగబలి యజ్ఞవాటముగాదు ఘోరిభీకరరణ భూమిగాని। చేబూపమాత్రండ్రిచేతిధారయు గాదుదారుణమృద్భాణధారగాని। వినగబుత్విజసామవేదనాదముగాదు తెరళవారణబృంహితములుగాని। బాగైన యాగప్రయోగంబుగాదెన్నయస్మచ్ఛస్త్రప్రయోగాతిశయము। సోమరసపానమిదిగాదుసోక్కెద్రోల। భయదశాత్రవదళితభీభత్సరసము। గాననీవేడయీ ఘోరకదనమేడ। గెలుపుగొనుపడవేగంబతొలగుకృష్ణా॥

క. దోసంబెంచకబలినిజ। వాసంబునకరిగివిప్రవరువేషమునక్।భాసిలుయాతనిసిరియక్। మోసంబునగొనినయట్లు మురియకుమచటక్॥

వ. అట్టిమాయోపాయంబు నిచ్చటనాగనివ్వనోయి శ్రీకృష్ణా.

శ్రీకృష్ణునివచనము॥ క॥ అసురాధమరణశూరుడు।పొసగంగాతన్నుదానుపొగడుకొనునెయా। కశమునసురలునుతింపగ। విసువకఖండింతునీదువేయుకరంబుల్॥ వ. నీకుసహాయుండైవచ్చినశివునిపాటెరింగియు మూర్ఖత్వంబుననేల నాతోపెనంగబూచెదవు యింకనైనబుద్ధికలిగి యనిరుద్ధునివిడిచినామరుంగుజొచ్చి ప్రాణంబులుకాచుకొనవోయి బాణాసురా.

బాణాసురునివచనము. క॥ పగవానినురుగుజొచ్చు నె।మగవాడెవడైన

యట్టిమాటలుబలుకక। తగవానగవానాతో। ఖగవాహనమూడునాదుకరలాఘవముగ॥వ॥మత్సహ సభుజాదండమండిత కోదండవిముక్త ప్రచండకాండంబుల నిన్నుకడిఖండలుగాచండిమాతంద్రిక బంధించిన పగదీర్చుచున్నాడనుగాని యనిరుద్ధునివిడువనోయిశ్రీకృష్ణా.

శ్రీకృష్ణునివచనము. ఐతేనాకరలాఘవంబుజూడవోయిబాణాసురా.

బాణునివచనము. అయితేనాకరలాఘవంబుజూడవోయిశ్రీకృష్ణా.

తాంతధణ తాంతధణ అని యుద్ధముచేయుట.

క. సురలునుతింపగనిర్వురు।దురమిటుగావించుచోటదోర్బలమెసగన్। హరిబాణునినిజశరముల। విరధునిగావించియతడువిననిట్లనియెన్.

శ్రీకృష్ణునివచనము॥ గీ. తోడువచ్చినశంభుండుతొలగనీదు । బాణజాలంబులన్నివిఫలతజెందె।సూతరథరథ్యకేతువుల్చూర్ణమయ్యె। యింకదికుకలుచూచినయేలవిడుతు॥

గీ. ఇట్లుబలుకుచున్నయిందీవరాక్షుతో। పోరుటకును పారిపోవుటకును। వశముగాకయున్నవార్తలువినివాని। జననియరుగుదెంచెసరభసమున॥

దరువు - నాట - రూపకము.

ఇదిగోకోటరవచ్చెను-రణభూమికి. ఇదిగోకోటరవచ్చెను - ఇదిగో కోటరవచ్చెదయతబిత్తరై-యదుసైన్యములు భారగదిమియార్చుచును। యి॥ తోరంపుగుబ్బలుతోడలపైబోరలగ- మూర్ఖుడునుపండుమదిమోమునను మెరయ॥ యి పల్లవెంట్రుకలుర్విపైకొనల్బిరాడ- అల్లవేములపల్లె హరికినెదురుగను॥

వ. ఇట్లువచ్చుచున్నకోటరంగని శ్రీకృష్ణునకుబలరాముండిట్లనియె.

క. బిత్తలియగుకాంతలతల। మెత్తికనుంగొనినదోషమెంతురుసుజనుల్। యిత్తరినదలుముకృష్ణా। వత్తముయిదిబోవవైరులంగెల్వంగన్.

వ. ఇప్పటికివెనకకుమరలవయ్యా తమ్ముడా శ్రీకృష్ణా.

శ్రీకృష్ణునివచనము. మంచిది ఆలాగెనన్నాబలభద్రా.

క. ఈరీతిన్ హరిమరలిన।యారగబాణాసురుండు యతదీనుండై। పాంపుదిజొచ్చితొల్పన్। జేరంజనితనమనమున జింతిలుచుండెన్.

కృష్ణునివచనము. ఇట్లువచ్చిపోయినరాక్షసియెవ్వరన్నా బలభద్రా.

బలభద్రునివచనము. కోటరయనిపిల్తురయ్యాతమ్ముడా శ్రీకృష్ణా.

శ్రీకృష్ణునివచనము. వివస్త్రియైయాలవచ్చెనయ్యా బలభద్రా.

బలభద్రవచనము. నీశరాసారంబులంజిక్కినబాణునకు పారిపోవనవకాశంబుగల్గినట్లుగా నటువచ్చెనయ్యాతమ్ముడా.

శ్రీకృష్ణునివచనము. బాణాసురుండేడన్నా బలభద్రా॥

బలభద్రునివచనము. ఇదేసందుగా పారిపోయి పురంబుజొచ్చెనయ్యా తమ్ముడా శ్రీకృష్ణా. శ్రీకృష్ణునివ. తిరిగియెప్పుడువచ్చునన్నా బలభద్రా.

బలభద్రునివ. ఇంతలోనేవచ్చుచున్నాడయ్యా శ్రీకృష్ణా.

బాణాసురుండు మరల యుద్ధమునకువచ్చుట.

క. అనునెడసన్నద్ధుండై। యనువందగనరదమెక్కి-యతులితభేరీ। ధ్వనులెసగహరిని వెదకుచు। చనుదెంచెనుబాణుఁడధిక సంరంభమునన్.

దరువు - నాట - జంపె.

ఏడిమత్స్యకృతుండేడి- కూర్మకృతుండేడి-కోడాకృతుండేడి- నరహరియు॥ఏ॥ ఏడివామనరూపుడేడిభార్గవరాముడేడి - శ్రీరాముండుఏడి హలధరుడు-ఏడిబౌద్ధాకారుడేడీశ్రీకల్కియును - ఏడివేములపల్లెఈశుడౌహరియు॥

ఆహాహా శ్రీకృష్ణా॥ శ్రీకృష్ణునివచనము. ఏమోయి బాణాసురా.

బాణాసురునివచనము. క॥ వచ్చితిసన్నద్ధుడనై। వచ్చితిచతురంగముల నుద్రవయ్యాలుగాగన్। గుచ్చితినాదగుశరముల। పిచ్చలవిడినీదుమేనవిష్వక్సేనా.

వ. ఇదిగోరావచ్చితినోయీ శ్రీకృష్ణా.

శ్రీకృష్ణునివచనము. క॥ మీసముమూతినగల్గియు। మోసంబునపారిపోయిమొగానివలెన్। రోసమునమరలితౌభళి। నీసరిశూరుండుగల్గు నేభువిలోనన్॥వ॥ పారిపోయియింతటిలోనే ఈశూరత్వంబెవ్వరివలన సంపాదించుకొనివచ్చితివోయి బాణాసురా. బాణునివచనము.

క. వినుగెలుపునునోటమియును। వనజేక్షణగల్గునెంత వారికినైనన్। మునుకాలయవనుడనివెను। కొనబారియునీవుశైలగుహలోజొరవే.

వ. యెటువంటిశూరునకైననుజయాపజయంబులు సమంబులైయుండు నిందులకునొకరికొకరుతిరస్కరింపంబనిలేదుయదియట్లుండనిమ్ము ప్రళయకాల కీలికీలాభీలవిశాలవాలమ్ముల నిన్నినేలందూలింపుచున్నానుబారావోరి శ్రీకృష్ణా.

శ్రీకృష్ణునివచనము. అలాగెనోయీ బాణాసురా.

తాంతతర్ఝణ అనియుద్ధముచేయుట.

అంతకృష్ణుండిట్లనియె- ఓయిబాణాసురా నీవుప్రయోగించినబాణంబులన్నియు మదీయార్ధచంద్రాస్త్రంబులంగొట్టివేసితి నింకదైత్యలోక భీకరంబైన ఈచక్రంబుచే కరచతుష్టయావశిష్టంబుగాని వేయుచేతులు నరికివేయుచున్నాను రావోయి బాణాసురా.

బాణునివచనము. అదియేలాగారారా శ్రీకృష్ణా- తాంతర్ఝణు అనియుద్ధముచేయుట. కృష్ణునివచనము.

క. చేతులుతెగిభూతలమున। యాతతగతిబడితివింక యను రీశ్వరకే,

తెరువున సారెదనిదె। నీతలధరగూల్తునొక్కనిమిషార్ధమునన్.

గీ. అనుచుచక్రముచేపట్టి యతిరయమున । దానవేంద్రుని తలద్రుంప బహానుశౌరి। కడ్డమేతెంచివినయంబుదోప। ఇంపుతోచంద్రశేఖరుండిట్లులనియె.

శివునివచనము. క॥ పక్షములువిరిగికూలిన । పక్షీంద్రునిపగిదికూలెబాహులుదుగియున్ ।రక్షింపుమురక్షింపుము। రక్షింపుముచంపకితని రాజీవాక్షా.

వ. దేవానీవువిశ్వరూపకుండవు నీమహిమంబెఱుంగక కావరంబున నెదిర్చినబిబ్బాణునింగర్వక్షీణునింగావించి లోకంబులకు మేలుచేసితీరిదియునాకుం గూడసమ్మతంబైయున్నయదియైనను మద్భక్తాగ్రేసరుండు గావున నాపైంగటాక్షించి ఈరాక్షసునిరక్షింపుము రక్షింపుము శ్రీకృష్ణా.

శ్రీకృష్ణునివచనము. క॥ మంచిదినీమాటలును। స్వాంతిసిబ్బాణదైత్యునిం గృపతోరక్షించితినీ రామెడయుక। యించుక భేదంబులేదు యీశానశివా.

క॥ కరములునాలుగుచక్కన్ ।బరిమార్చితివీడునీదుభక్తులకగ్రేసరుడై పొగడొందుజరా। మరణాదిభయంబునకిక మనునిటపిదప్.

వ. మద్భక్తుండైనప్రహ్లాదునకతనివంశంబు వారలంజంపననిన్నృసింహావతారంబున వరంబొసంగియుండితినితండాప్రహ్లాదునకు మునిమనమండుగావునను నీదగుభక్తాగ్రేసరుండుగావునను నితనింజంపకవిడిచితి నిమ్మాటలు మమ్మాటికిన్నమ్ము నోశంకరా. అనిన గంగాధరుండు సంతుష్టాంతరంగుండయి బాణునకిట్లనియె.

శివునివచనము. ఓయిబాణాసురా.

బా॥ ఏమయ్యాస్వామీ ఈశ్వరా.

శివునివచనము. ఇమ్మహానుభావుండైన శ్రీకృష్ణుండుయాచంద్రార్కంబు గాయాయురారోగ్యైశ్వర్యవంతుండవైయుండుమనివరంబొసంగియున్నాడుగావున ఇంకశంకవిడిచి పురంబునకరిగియనిరుద్ధ ఉషాకన్యల నలంకృతులంగావించుకొనివచ్చి శ్రీకృష్ణునకుసమర్పించి యతనికరుణాకటాక్షమునకు పాత్రుండవైయుండవోయీ బాణాసురా॥

బాణాసురునివచనము. మంచిదిబుద్ధిస్వామీ.

క॥ అనిపలికిబాణుదైత్యుం।డనువొందగపురము జేరనరుదెంచుటయున్। వినిరత్నవల్లియెదురుగ । జనివిభువికృతాంగుగాంచిచంచలమతియై ఇట్లనియె.

దరువు - ఆహిరి - అట - రత్నవల్లివచనము.

కరితుండములసొంపుగలిగిననీవేయుకరములుధరగూలెనా॥ ప్రాణేశా॥ గండిశాత్రవకాలదండములగుభుజా-దండములిట్లాయెనా ॥ ప్రా ॥ నవరత్నకేయూరోన్నతభుజాపళులునీయవనిపాలైపోయెనా ॥ ప్రా ॥ అనిశముశివపూజ

నలరునీచేతులుతునియలైనడిపోమెనా ॥ ప్రా ॥ ధరణివేములపల్లెధాముడైన శ్రీహరినిన్నుయిటుజేసెనా॥ ప్రా॥

ద్విపద॥ ఓబాణదైత్యేంద్రవో ధైర్యసాంద్ర- నీబాహుగర్వంబునేటితో జనెనే- అమరేంద్రుడాదిగాయష్టదిక్పతుల - సమరంబులోపల సాధించునట్టి- చలమునుబలమునుసాహసంబేల- జలజాక్షుచేనేడుసమసెనేనాధ-వలదుకృష్ణునితోడవైరంబటంచు- పలుమారుజెప్పినపాటింపవైతి- వతడాదివిష్ణుండు యతడవ్యయుండు-యతనితోసంగరమసురేశనీకు-ముప్పగుననుచునుముమ్మాటునేను- చెప్పినమాటలుచెవిచేర్పవైతి- హరుడుండభయమేమియంటివిగాక- హరిహరులొకటియోటరయంగలేక- పగగొంటివిట్టిమూసదగంటివకట - నగుబాటువాటిల్లెవల్లురిలోన- ధరణి వేములపల్లెధాముడైనట్టి - హరిచక్రధారచే యసురకులేశ- కరములుదెగిహీనగతినిబొందితివే॥

బాణుని వచనము.

క॥ కాంతామణివినుమాశ్రిత । చింతామణియైనయట్టిశ్రీహరికరుణా। స్వాంతుండైమొసగెను। కల్పాంతమునందాకయాయువైశ్వర్యంబుల్॥

క॥ కరములుపోయినపోనీ। పరమాత్మునికరుణకేనుపాత్రుడనైతిన్। బరమాణువుమ్మనీకీపరితాపంబేలనాదుపలుకులువినవే॥ వ॥ మనయనిరుద్ధవుషాకన్యలంగొనిపోయి శ్రీకృష్ణునకుసమర్పింపవలెగావున నీవుశీఘ్రంబున యాదంపతులకుమంగళస్నానంబుచేయించి దివ్యమాల్యాంబరణాంబర భూషణాద్యలంకృతులంగావించి యిచ్చటికిందోడ్కొనిరావే వోరత్నవల్లి.

రత్నవల్లివచనము. ఆలాగే దెచ్చియున్నానుస్వామీ.

వ. అనినబాణుండు రత్నవల్లిసమేతుండై యనిరుద్ధ ఉషాకన్యలందోడ్కొని శ్రీకృష్ణునిసముఖంబునకరుగుదెంచి నిజకరచతుష్టయంబుముకుళించి యిట్లనివినుతింపందొడంగె॥

దరువు - శంకరాభరణము - ఆదితాళము.

దండము శ్రీహరిగోవిందా - దండము - దండమిదిగో వేదండవరదయాఖండలనుత శ్రీపుండరీకాక్షా ॥ దం ॥ పీతాంబరధరపూతనహరనవ - నీతచోరపారిజాతాపహారా॥ భాసురాంగా శ్రీనివాసా - వేములపల్లెవాస శ్రీభక్తోల్లాసనాకృష్ణా॥

దశావతారవర్ణనము.

క॥ శ్రీవరమత్స్యాకృతివై। దేవారిన్ద్రుంచివిధికిధీరశ్రుతులన్ తివినొసంగితివాభళి। శ్రీవేములపల్లెవాసచిత్రవిలాసా॥ ౧॥ దేవతలభినుతిసేయగ। యావననిధిలోనకూర్మమైమంథాన। గ్రావంబెత్తితివాభళి॥ శ్రీ॥ భావించినుక

రాకృతి। గావించిహిరణ్యాక్షునేత్రుఖండించిత్వరగ। భూవలయంబె త్తితివట॥ శ్రీ॥ 3॥ దేవసభా స్తంభముగ। దావిర్భవమందిదైత్యుహరియించిదయన్। భావించితివటతత్సుతు॥ శ్రీ॥ ४॥ కోపించుతెన్నుగవామన। దేవుడవైయవతరించిదీరతబలినిగ। దేవ చెడంగొట్టితివట॥ శ్రీ॥ ౫॥ భూవలయంబిరువదియొక। యావర్తిందిరిగినృపులహరియించినభూ। దేవకులాగ్రణివీవే॥ శ్రీ॥ ౬॥ శ్రీవిలసిల్లగదశరథ। భూవరునకునుద్భవించిధువిరాముడనన్। రావణునింద్రుం చెతివట॥ శ్రీ॥ ౭॥ దేవాకృష్ణశ్రీబల। సేవాకృతితోడ నేడుదినములు కేలగ। గోవర్ధనమె త్తితివట॥ శ్రీ॥ ౮॥ నీవెకదా బౌద్ధుడవై। వావిరిదయి తేయసతులవ్రతభంగంబుల్। గావించినగుణశాలివి॥ శ్రీ॥౯॥ దేవరనీమహిమమునుతి। గావింపగనెంతవాడకలియుగమందుగ। నీవెకదాకలివిద్ధర॥ శ్రీ ౧౦॥ గీ॥ ఇతడునీదుపౌత్రుడి త్తన్వినాపుత్రి। యీడుజోడెరింగియురుపురికెని। తగునటంచుబ్రహ్మదాంపత్యమొనగూర్చి। యతనిమహిమదెలియనలవియగునె॥ వ॥ దేవానీవుసర్వసాక్షిస్వరూపకుండగు నీదగుసమక్షంబునమత్పుత్రియైనయుషాకన్యకారత్నంబును, నీపౌత్రకుండైన యనిరుద్ధకుమారరత్నంబున నవరత్నభూషణయుతంబుగాసాలంకృత కన్యాదానంబుగావించితినింక ఈదంపతులంబరిగ్రహించి నాపయింగటాక్షించి నేజేయుయపరాధంబులన్నియుమన్నించి రక్షింపుముస్వామి॥ శ్రీకృష్ణా॥

కృష్ణునివచనము॥ క॥ కయ్యామునగల్గుతప్పులు। నెయ్యానమరచితినికవిడువుముభయముగ। వియ్యాపునడవడినుందము। నెయ్యంబుననునముయామినీచరవర్యా॥

వ॥ ఈదంపతులంబరిగ్రహించితి నీపయింగటాక్షించితి నీచేయుయపరాధంబులన్నియుమన్నించితినింకసుఖంబున రాక్షసరాజ్యలక్ష్మీవైభవంబులనుభవింపుచు నప్పటప్పటికి మాకడకువచ్చుచుంబోవుచు మదీయకరుణాకటాక్షంబునకుపాత్రుండవగు యుండవోయీబాణాసురా.

బాణునివచనము. మంచిబుద్ధిస్వామీ. కృష్ణునివచనము.

ఇంకమాకుపనులనేకంబులుకలవు ఈదంపతులందోడ్కొని ద్వారకాపురంబునకుంబోయివచ్చుచున్నా ననుజ్ఞయొసంగవోయీబాణాసురా.

బాణునివచనము. మంచిబుద్ధిస్వామీ.

క॥ అనిపనుపబాణువీడ్కొని। వనజాక్షుడుభటతురంగవారణయుతుడై। యనిరుద్ధయుషాంగనలను। కనకరథంబుననునిడుక కదలెగ పురికిగ॥

వ. ఇట్లుబలభద్రప్రద్యుమ్నసాంబసారణసాత్యప్రముఖయందు సేనాసమేతుండైపోయిద్వారకాపురంబుడాయుంజనిన పురలక్ష్మి కృష్ణసందర్శన కుతూహలమ్మైచేపర్నిలంజీరుచందంబున నందంబునొందునుద్ధూత తరళవిచిత్ర కేతుప

తాకాభిశోభితంబును-మహనీయమరకతతోరణమండితంబును - కనకమణివినిర్మితగోపురసౌధప్రాసాదవీథికావిలసితంబును - మౌక్తికవితాన విరచితమంగళరంగవల్లివిరాజితంబును- శోభనాకలితవిన్యస్తకదళికాస్తంభసురభికుసుమమాలికాతతాలంకృతంబును కుసుమమరందసంసిక్తవిపణిమార్గంబును - శంఖదుందుభిభేరీమృదంగపటహకాహళాది మంగళారావకలితంబును - వందిమాగధసంగీతప్రసంగంబునుంకల్గి యతిమనోహర విభవాభిరామంబైన నిజపురంబు జొచ్చి రాజమార్గంబునవచ్చుచు సచివపురోహిత సుహృద్బాంధవముఖ్యులెదురుకొన-భూసురాశీర్వాదంబులును పుణ్యాంగనాకరకలిత లలితాక్షతంబులు గైకొనుచుమందగమనంబునంబోయి - నిజగృహద్వారంబునరథంబుడిగ్గి నంగనుంగొనికొందరిందుముఖు- శృంగారంబులగు బంగారుపళ్లెరంబుల కర్పూరనీరాజనంబులు దెచ్చినివారింపుచు హరినుద్దేశించి శోభనంబుపాటలు బాడిరట యెటువలెనంటేని॥

శోభనపాట- తోడి - అటతాళము.

దేవతలునుప్రార్థింపగను- భూవలయంబునుబ్రోచుటకై- దేవకికడుపునధీరతబుట్టిన- దేవునకునువాసుదేవునకు॥శో॥కీరవాణులుజలక్రీడలాడ- భూరితలలోపొంచిపొంచిచీరలెత్తుకపోన్నచెట్టెగబ్రాకిన - చోరునకతి శృంగారునకు॥ శో॥ కొట్టజాలకతల్లిగుట్టుగను-పట్టుకరోటికికట్టినను - మట్టుమీరియామద్దులగూల్చినరట్టడిశ్రీకృష్ణరాయునకు॥ శో॥ ౩॥ ఆముకశిశుపాలాదులగు-భూమినాయకులబోడరమి- ప్రేమితోరుక్మిణిపెండ్లాడిన శ్రీవేములపల్లెనివేశునకు॥ శో॥ ౪॥

మంగళహారతి - సురటి - అటతాళము.

ఖ్యాతిమీరగజలజాతభవామరవ్రాతములెల్లను ప్రార్థింపగా భూతలననందుపుత్రుడై పెరుగుచు- పూతనజంపినపుండరీకాక్ష ॥ మంగళంమంగళం రాధాలోలా॥ మం॥౧॥ఆలమందలపైనమరేంద్రుడలుకచే రాలవానేడుదినాలుగురియ-కేలగోవర్ధనశైలమెత్తియుగో- పాలులబ్రోచినశ్రీలక్ష్మీలోల॥మం॥ ధీరతతోపన్నగారిపైనెక్కి-బలాధినిర్జించియువోరిలోన - పారిజాతము సత్యభామకొసంగిన- శ్రీరమ్యగుణహార శ్రితజనాధారా॥మం॥ ౩॥ దురమునసరకాసురునిసంహరించివిరివిగపదియారువేలనుంది పరభృతవాణులపరిణయమందిన ధరణివేములపల్లెధామశ్రీకృష్ణా। మం॥ ౪॥

వ. అనియిట్లునీరాజనంబులొసంగుకీరవాణులకు నిష్టార్థంబు లొసంగుచు-శుభముహూర్తంబుననవవధూవరుల గృహప్రవేశంబుజేయించి జననీజనకసుహృద్బాంధవనిజగాంతానివహంబులకు యనిరుద్ధఉషాకన్యలంజూపి వారల సంతుష్టాంతరంగులంగావించియున్నంత కొంతకాలంబునకు నవమాసంబులు-

నిండె నా॥క॥శుభదినమున శుభవేళన్। శుభములు వీక్షింపబడిన శుభలగ్నమునన్।
శుభవతియైనయుషాసతి। శుభలక్షణయుతునినొక్క సుతునిం గనియెన్॥వ॥
ఇట్లుదయించిన మునిమనికి జాతక్రియలాచరించి బ్రాహ్మణులు గోభూహిరణ్యకన్యాదానంబులొసంగి దినదినప్రవర్థమానుండగు యక్కుమారోపలాలవిందానందకందళితహృదయారవిందుండై నిజసుందరీబృందంబులగూడి గోవిందుండు సుఖంబుననుండెనని శుకయోగీంద్రు పరీక్షిన్నరేంద్రునకుం జెప్పె.

ద్విపద. అనియమ్మనూరివంశాబ్ధిచంద్రుండు- గొనకొని శ్రీవత్స గోత్రపవిత్రు-డనువందనసీలకంఠార్యపుత్రుడు- సునయుడౌ వేంకటసుబ్బసత్కవియు ధరణి వేములపల్లెధాముడై శౌరికి నిరవయిన శ్రీ వేంకటేశ్వరు పేర- ప్రచురంబుగా నుషాపరిణయం బేల మీర రచియించె సత్కవి రాజులు మెచ్చ - ఈకథజదివి నింపుగావిన్న- చేకొని వ్రాసినచెలగియాడినను- ఆయురారోగ్యభాగ్యాదిసంపదలు- తోయజాక్షుని కృపతో డుతనొసగు- కులగిరులెందాక కూర్మమెందాక - జలనిధులెందాక సత్యమెందాక- సోమారుకులెందాక చుక్కలెందాక - భూమియునాకాశభూతమెందాక - యందాక శ్రీకృష్ణుయశము రాజిల్లు- నందాక యీకథయవని దెంపొందు॥

వేములపల్లె - ఉషాపరిణయము - నాటకము.

సంపూర్ణము.

౧౯౧౨ - సం. చన్నపట్టణము. జి. బి. ఆర్. ప్రెస్సు.